# రాజ్యకాంక్ష

వివరణాత్మక విశ్లేషణతో కూడిన

(జానపద నాటిక)



పట్టెల రామకోటేశ్వర రావు

# రాజ్యకాంక్ష

వివరణాత్మక విశ్లేషణతో కూడిన
జానపద నాటిక

రచన

పట్టెల రామ కోటేశ్వరరావు

A

**రాజ్యకాంక్ష**

ప్రథమ ముద్రణ........ 1965 500 కాపీలు
ద్వితీయ ముద్రణ ...... 2012 1000 కాపీలు
తృతీయ ముద్రణ ..... 2017 1000 కాపీలు

వెల: నలభై ఐదు రుపాయలు మాత్రమే, రూ. 45/-

ప్రతులకు
**వట్టెల రామకోటేశ్వర రావు**
డోర్ నెం. 20-1-49, బండ్లమిట్ట,
మంగళపాలెం, ఒంగోలు - 523 001.
ప్రకాశం జిల్లా.
సెల్ : 9948214995 / 8019614995

కవర్ డిజైన్ :
శ్రీ బి.వి. సత్యమూర్తి

ముద్రణ :
**సాయిరాం ప్రింటర్స్**
టెలిఫోన్ భవన్ ఎదుట, సాయి బాబా వీధి,
సైఫాబాద్, హైదరాబాద్ - 500 004.
ఫోన్ నెం. 040-23232316

## 'మనవి'

ఈ నాటికను ప్రదర్శించువారు ముందుగా నా అభిప్రాయం తెలుసు కొనుట కొంత శ్రేయస్కరం. తదుపరి ఈ నాటిక యొక్క సర్వ హక్కులు నావే గనుక ముందుగా నాకు తెలియ పరచి ప్రదర్శించుట చిన్న మర్యాద.

ఇలాగని ఈ నాటిక ప్రధమ ముద్రణ గావించిన 1965 వ సం లో ప్రకటించడం జరిగినది. ఆ తరువాత దీని ద్వితీయ ముద్రణ నలభై ఏడు సంవత్సరముల తరువాత జరుగు చున్నది!

అప్పటి ముద్రణ కేవలం ప్రదర్శనకు మాత్రమే యోగ్యత గలదిగా వ్రాసి ప్రచురించడం జరిగినది.దానిని మరలా ద్వితీయ ముద్రణ గావించ వలెననెడి సత్సంకల్పం మనసులో కలిగి...కొంత మార్పులతో–అంటే అప్పటి డైలాగులన్నియును యధా తధము గనే ఉంచి,దానికి కొంత వివరణాత్మక విశ్లేషణను జతకూర్చి, పాఠక ప్రియులు మామూలుగా చదువు కొనుటకు కూడా యోగ్యత కలుగు లాగున రూపు గావించి, ముద్రణ గావించిడం జరిగినది.నా ఈ ప్రయత్నం సరైనదా– కాదా అనెడి నిర్ణయం పాఠకులకు మాత్రమే వదలి వేయు చున్నాను.

ఏది ఏమైన కళా ప్రపంచం అనెడి ప్రదేశం ఎంతో సువిశాలమైనది, అతి విశిష్ట మైనది గనుక ఎన్నిరూపాలు దాల్చిన కవితల నైనా,మరెన్నో రూపాంతరాలు చెందిన రచనలనైనా, హాయిగా సేద దీర్చు కొనుటకు అనువగు చోటును ఆదరంతో అందించడం జరుగుతుంది గనుక...ఇలాగ ఎన్నెన్ని మార్పులతో వ్రాసి ముద్రణ గావించినను, అందులో ఏమాత్రం కూడ అభిరుచి చెడకుండగా చేసి,రచనా సామర్ధ్యము లోపించ కుండగా రూపు గావించిన, తధాస్తు దేవతలు దీవించ గలరని, పాఠక దేవుళ్ళు ప్రోత్సహించగలరనే ప్రగాఢ నమ్మకంతోనే, నా యీ ప్రయత్నము, తాప త్రయం కూడా!

ఆర్కేపట్టెల

# 'అంకితం'

నా ఉన్నతిని కాక్షించి, కళాభిరుచిని ప్రోత్స హించి గత నలభై ఏడేండ్ల క్రితం స్వర్గస్తుడైన నా 'తమ్ముడు' స్వర్గీయ పట్టెల నాగేశ్వర రావు, S/o. వీరస్వామి గారికి అప్పుదు ఈ నా రచనను అంకితం ఇవ్వడం జరిగినది. మూల మంతయు అదియే గనుక, ఈ ద్వితీయ ముద్రణను కూడా అతగానికే అంకితం గావించడం సముచితంగా భావించి స్వర్గీయ 'పట్టెల నాగేశ్వర రావు S/o.వీరస్వామి' గారికే దీనిని కూడా అంకితం గావించు చున్నాను.

ఆర్కేపట్టెల

## 'చిన్నమనవి'

సహృదయులైన పాఠకులకు ఒక చిన్న మనవి. నేను అభిలాష కొలది కాళా సేవపై గల అభిరుచికొలది గత యాభై ఏండ్ల క్రితం ఈ 'నాటిక' వ్రాయడం జరిగినది. ఇందలి పాత్రలు ప్రదేశాలు కేవలం కల్పితాలు మత్రమే.

ఏ చరిత్రనూ అధార పరచుకొని వ్రాసినది ఎంత మాత్రం కూడా కాదు. ఎవరి చరిత్రను కించ పరచే విధంగా వ్రాసినది అసలే కాదని గమనించ ప్రార్ధన. వీలైనచో మీ అముల్యమైన సలహాలను ఆదరంతో అందిస్తే అభిమానంతో స్వీకరించి, అమితానందాన్ని పొంద గలనని వినయ పూర్వకంగా మనవి చేసు కొంటున్నాను.

ఆర్కేపట్టెల

# ప్రార్థన గీతం

వాణీ కళా జీవని శ్రీ....
వాణీ కళా జీవని శ్రీ.... ॥వాణీ॥

సకల సాహిత్య శృంగార రసభావనీ... ॥వాణీ॥

రవి కాంతి ప్రసరించి,భువి శాంతి యొనరించె,
కళ భ్రాంతి కలిగించవె....క॥
నిరతము నినుమది కొలిచెద మమ్మా... ॥వాణీ॥

పండితుల వొప్పించి, ప్రాజ్ఞులను రప్పించి,
పామరుల మెప్పించవే...పా॥
శిరమొంచి నీ దివ్య పాదములు పూజింతు ॥వాణీ॥

కవి మదిని కదిలించి,నవ కవిత చిలికించి,
మా చేత పలికించవే ... మా॥
జగతిలో ప్రగతిగ వినుతి చేసెదము ॥వాణీ॥

ఆర్కేపట్టెల

# నటవర్గం

1. మహారాజు
2. మహా మంత్రి
3. రాజ గురువు
4. మార్తాండ వర్మ
5. విక్రమ వర్మ
6. విజయుడు
7. భేతాళుడు
8. మెంకడు
9. మల్లమ్మ

# 'రాజ్యకాంక్ష

## జానపద నాటిక

అది ఒక రాజ దర్బారు. సింహాసన మందు మహారాజు, ఇరు వైపుల తమ కుమారులైన మార్తాండ వర్మ,విక్రమ వర్మలు. మార్తాండ వర్మ ప్రక్కన మహా మంత్రి , రాజ గురువు తమ తమ ఆసనాలను అధిష్టించి యుందురు.

ఇతర శాఖలను నిర్వహించుచుండెడి మంత్రులు కూడా, ఒక్కొక్కరే ఒచ్చి,తమ తమ ఆసనములయందు ఆసీనులగు ముందుగా,ప్రభువుల వారికి అభివాదాము గావించి,రాజగురువుల వారికిని కూడా దండ ప్రణామము లాచరించిన పిదప మాత్రమె,తమ తమ ఆసనములయందు కూర్చొను చుండిరి. అది సభా మర్యాద గను సంస్కార యుత సాంప్ర దాయము గను,మంత్రులెల్లరు పాటించుచు ఆచరించు చుండిరి.

వీక్షించ వచ్చిన పుర ప్రజలతోడను, ఆహ్వానాలను అందుకొని విచ్చేసిన పొరుగు దేశ ప్రముఖుల తోడను,గ్యాలరీలన్నియు క్రిక్కిరిసి నిండిపో సాగినవి.

అనేక కళల యందు నైపుణ్యము గలదియును,నాట్య కళా కౌశలమందు విశేష ప్రజ్ఞ కలిగిన 'నర్తకి' మంజులహరి-అమిత రూప లావణ్యము తోడను, ప్రతిభా వంతుడైన 'శిల్పి' మలచిన లాగున గల అంగ సౌష్టవమును సంత రించుకొని, చూపరుల దృష్టిని విశేషంగా ఆకర్షించు లాగున అలంకరణ గావించుకొని, సభయందు ప్రవేశించినది!

ముందుగా ప్రభువుల వారికిని, ఆ తదుపరి రాజగురువునకును తది తర పెద్దలకును అభివాదము గావించి,నాట్యప్రాంగణము నందు వేచి యున్నది ప్రభువుల వారి ఆజ్ఞకొరకు! వాద్య బృందం ఎల్లరును కూడ వారి వారి స్థానముల యందు కూర్చొని, తమ యొక్క వాద్య తంత్రులను శిద్ధము గావించు కొను చుండిరి. రశికతలో రాటు దేలిన విక్రమ వర్మ కైపు కళ్లకు, మంజులహరి ఇంద్ర లోకము నుండి అరుదెంచిన దివ్య సుందరిలాగ అగుపించ సాగినది!

ఇది సభా ప్రాంగణము అయిన కారణంగా, బుద్ధిని అదుపు చేయడం జరిగింది గాని,అదే మరో ప్రాంగణమే అయి ఉండి, ఇలాంటి సౌందర్య రాశి కంట బడితే, తన

తుంటరి మనసును అదుపు గావించెడి వాడా! ఆ సుందరి పొందు నందకుండగా చేష్టలుడిగి చూస్తూండెడి వాడా? అసంభవం!

ఇలాగ ఊహలు గావించు విక్రమ వర్మ ఆలోచనలకు అంతరాయంగా,నర్తకి నాట్య మాడుటకు ప్రారంభపు సంకేతముగా గంట మ్రోగినది! సభా ప్రాంగణ మంతయూ నిశ్శబ్దము ఆవరించినది. ఒక శ్రావ్యమైన గళం అతి మనోహరంగా గానం ప్రారంభించగా,అంతే మృదు మధుర అభినయంతో మంజు లహరి నాట్యం ప్రారంభించినది.

సభ యావత్తూ కరతాళ ధ్వనులు మిన్ను ముట్టగా,జయ జయ ధ్వానాలు మారు మ్రోగగా, ప్రభువులవారు నాట్యబ్రుందాన్ని తగు రీతిలో కానుకల రూపంలో సత్కరించగా,బహుమతులు స్వీకరించిన నర్తకి బ్రుందము సభనుండి నిష్క్రమించగా,మహా మంత్రులవారు ఆసనము నుండి లేచి,ప్రభువుల అనుమతి గ్రహించి,రాజగురువు ఆమోదముతో సభ నుద్దేశించి ప్రసంగించ సాగిరి.

## (1 వ రంగము)

మహా మంత్రి:- "రాజ పౌరులారా! ప్రజలారా ! మన విజయ నగర సామ్రాజ్య పతి యైన ధర్మ భూపాల మహా రాజులు ఎంత కాలము నుండి ఈ రాజ్యాన్ని పరి పాలిస్తున్నది మీ ఎల్లరకు తెలిసిన విషయమే!... అక్రమాలు జరుగ నివ్వక, అన్యాయాలను అరికట్టుచూ, మన రాజ్యముపై పరాయి రాజులు దండెత్తి రాకుండగా కాపాడుచూ, ఇంత కాలము కన్న తండ్రిలా మన మొర లాలకిస్తూ,ప్రజల సుఖమే తమ సుఖ మనుకొని, ప్రజల ఆనందమే తమ ఆనంద మనుకొని, దేశ ధర్మాన్ని దేశ రక్షణను, ఇంత కాలము కంటికి రెప్పలా కాపాడు కొనుచూ వచ్చిన మన మహా రాజు గారు, వృధాప్యము పైన బడిన కారణంగా, బాధ్యతల నిర్వహణ కష్ట సాధ్యముగా తోచి, వారి పెద్ద కుమారుడైన మార్తాండ వర్మ గారికి ఈరాజ్య భారాన్ని అప్పగించాలని సంకల్పించారు.

అది సభా ముఖంగా తెలియ జేసి, ముందుగా రాజ గురువుల వారి ఆమోదంతోనూ,ఆ తరువాత ప్రజాభిప్రాయ సేకరణతోనూ, ఈ కార్య క్రమాన్ని నిర్వహింప తలపెట్టినారు.అది ప్రభువుల వాక్కు రూపంలో తెలియజేయడం పెద్దల అభీష్టంగా భావించి,ఆ శుభవార్తను వారినే ప్రకటించ వలసిందిగా కోరు చున్నాను!

అంటూ మహామంత్రి తన ప్రసంగాన్ని ముగించి,యధావిధిగా తమ ఆసనముపైన ఆసీను లైనా రు.ఈ ప్రకటనతో సభలో కల కలం బయలు దేరినది. విక్రమవర్మ అతని హితులలోనూ కలవర పాటును కలిగిస్తూ, క్రోధాగ్ని జ్వాలలు రగల్చసాగింది! ఇంతలో మహారాజు ధర్మ భూపాలవర్మ ఆసనము నుండి లేచి, ముందుగా రాజగురువునకు అభివాదము గావించి,ఆ పిదప సభా సదుల నుద్దేశించి ప్రసంగించ సాగిరి.

మహా రాజు:- న్యాయ పౌరులారా! ప్రజలారా! తామెల్లరూ, దేశ పరిపాలనా భారపు విషయా లపై ఇంత కాలం మీరు చూపిన భక్తి శ్రద్ధలతోనే, మేమింత కాలం ఈ రాజ్య భారాన్ని నిర్వర్తించ గలిగాము. ఇపుడు నాకు వయసు మళ్లినందు వలన, పని భారం పెరిగినందు వలన రాజ్య భారాన్ని నిర్వర్తించడం కష్టతరంగా యుండి, చిరంజీవి మార్తాండ వర్మకు రాజ్య భారాన్ని అప్పగించి నేను విశ్రాంతి తీసుకోవాలని సంకల్పించాను! ఇట్టి భారాన్ని చిరంజీవి శిరస్సున మోవ నిశ్చయించి,ముందుగా ప్రజల అభిప్రాయం నిర్భయంగా,నిస్సంకోచంగా, నిర్మొహ మాటంగా తెలియ జేయ గలందులకు మిమ్మల్ని ప్రార్ధిస్తున్నాను!"

అని మహారాజు తమ ఆసనముపైన ఆసీనులు కాగా, సభలో గుస గుసలు ప్రారంభమైనవి.ఒకరి నుండి మరొకరి అభిప్రాయ సేకరణలు, కొందరు ఆమోదము వైపు మొగ్గు చూపుతూ ఉంటే...మరి కొందరు అభ్యంతర మునకై ఆతృత కనబర్చసాగిరి.. అలాంటి వారిని మరి కొందరు ఆపే ప్రయత్నమూ చేయసాగిరి. అలా అభ్యంతరం కన బర్చాలని ప్రయత్నించిన వారు విక్రమ వర్మ స్నే హితులూ, సన్నిహితులే!ఇలా వారిలో వారు తర్క వితర్కాలు జరుపు కొనుచూ ఉండగానే, మహా మంత్రుల వారు తమ ఆసనము నుండి లేచి నిలబడి,ప్రజలందరి తరుఫున తాను ప్రతి నిధిలా..

మహా మంత్రి:- "మహారాజా! తర తరాలుగా పాలించ వలసిన దేశం, రాజగౌరవాన్ని, ప్రజల సౌకర్యాన్ని కాపాడుతూ, ధర్మము తప్పకుండగా ఈ రాజ్యాన్ని పరిపాలించెదమని వారు అంగీక రించిన యెడల- యువ రాజులవారు పట్టాభిషిక్తులగుటకు ప్రజలకెట్టి అభ్యంతరము ఉండదని నేను భావిస్తున్నాను! వారు ఆ విధముగా సభాముఖంగా ప్రమాణము గావించి, ఆచరించు లాగున నమ్మిక కలుగ జేసిన యెడల, అందరి ఆమోదము లభించ గలదని నేను ఆశిస్తున్నాను!"

అని మహా మంత్రి ప్రజా ప్రాంగణం వైపు దృష్టి సారించి,నేను కోరినది మీకు సమ్మతమేనా?...అన్న విధముగా అందరి వైపు చూపు మరల్చి చూడసాగిరి! ప్రజలలో కొందరు-అవును అవును యువరాజు ఆ విధంగా ప్రమాణము గావించిన మాకు సమ్మతమే! అన్న విధముగా వాళ్ల ఆమోదం తెలిపిరి.అంతట రాజ గురువు కల్పించుకొని...

రాజ గురువు:- "మహారాజా! ఇది విజయ నగర సామ్రాజ్యపు వీర చరిత్రకు సంబంధించిన విష యంగా ముందు మనం దీన్ని తీసుకోవాలి! మీ పూర్వులు గతంలో ఎంత గొప్పగా ఈ రాజ్యాన్ని పరి పాలించారో, ముందుగా అది యువ రాజుల వారు తెలుసు కోవాలి!వారి పౌరుష పరాక్రమాలు ఏపాటివో,వారి దాతృత్వపు దాన గుణాలు మరెంతటి ఉదాత్త మైనవో,ఉదారత కలిగినవో...

అలా సాగిన వారి పరిపాలన యందు ప్రజలు ఎంత శుభిక్షంగా బ్రతుకు కొన సాగించినారో, ముందుగా మనం వారికి తెలియ జేయడం ఎంతో అవసరం. వారు ముందుగా తెలిసి కొనుటయు కూడా అంతే అవసరము, ఆవశ్యకము కూడా! నా యొక్క సూచన యువరాజుల వారికి ఎంత వరకు ఆమోద యోగ్యమో విచారించండి! ఆ తదుపరి తమ అభీష్టం రూపు దాల్చి అమలు గావించండి."

అని రాజ గురువు తన విద్యుక్త ధర్మాన్ని-తాను నిర్వహించి, తగు సూచనను ఒక హిత బోధలా ఉపదేశించడం-రాజ గురువుల దూర దృష్టికి అద్దం పట్టినట్లయింది; అర్థం చెప్పినట్లయింది.పాటించడం పాటించక పోవడం అనేది ప్రభువుల అభీష్టమయితే,

బోధించడం, ఆదేశించడం అనేది రాజ గురువుల బాధ్యత! ఎవరి ధర్మాలు వాళ్లు సక్రమంగా నిర్వహించి,ఎవరి బాధ్యతలు వారు యధావిధిగా కొన సాగించ గలిగితే,అరిష్టాలనేవి ఆమడ దూరం పారిపో గలవు! అఘాయిత్యాలనేవి ఆ చూకి లేకుండగా అంతరించనూ గలవు! రాజగురువుల బోధమార్తాండ వర్మకు మంగళప్రదమైన అక్షింతలుగా తోచాయి అంతటి అమూల్యమైన సూచనను, ఆశీర్వచన పూర్వకంగా భావించిన మార్తాండ వర్మ తమ ఆసనము నుండి పైకి లేచి,ప్రజల నుద్దేశించి...

మార్తాండవర్మ:- ప్రియమైన పౌరులారా! ప్రజలారా! రాజ గురువుల యోచన ఎంతయో అభి నందనీయం! వారి సూచన కూడా బహుదా ప్రశంశనీయం! దేశము కొందరికే సొంత మనుచు,ఇందు ఎవ్వరికిని హక్కు లేదని తలంచక,అందరికిని సమాన హక్కులున్నవని గ్రహించాలి! మీ అందరి సహాయసహకారాలతో అభ్యు దయానికి పాటు పడుతూ,దేశ ధర్మాన్ని నిలబెట్టి రాజ్యము పాలించెదమని మేము వాగ్దానము చేయు చున్నాము! మా పితృపితామహుల పాలనకు ధీటుగా,మేమునూ పరిపాలన గావింతుమని,రాగద్వేషాలకు, తర తమ భేదాలకు,అధికార దురహంకారాలకు మా పరి పాలనలో చరమ గీతం పాడటం జరుగుతుందని,ఇంతటి నిండు సభలో, ఇందరి పెద్దల సమక్షమున,నిండు మనసుతో వాగ్దానము చేయుచున్నాను!.

అని గంభీర స్వరంతో పలికిన యువ రాజుల వారు తమ ఆసనముపై కూర్చుండిరి. మార్తాండవర్మ వాగ్దానము రాజ గురువునకే కాకుండగా, మహారాజునకు కూడా మహదానందము కలిగించినది! మహామంత్రులవారికి ఊరట కలిగించెడి వాక్కులుగా అవి తోచి,అందరూ ఒక్క పెట్టున హర్షధ్వానాలు గావించిరి. కాని... విక్రమ వర్మ మాత్రము – లెక్కకు మిక్కిలిగా గల క్రోధమును గ్రక్కెడి వాని వలె–ఒక్క ఉదుటన తన ఆసనము నుండి పైకి లేచి, సభనంతయూ ఒక్కమారు కలయ జూసి,జ్వలించే చూపులు తండ్రిపై ప్రసరింప జేస్తూ...

విక్రమ వర్మ:- "ఓ!...మహారాజుల రాజీనామ పత్రాలు! యువరాజులైన మార్తండ వర్మను సింహాసనాధి పతిగా శాసనాలు! అందుకు రాజ గురువుల పరిపాలనాపూర్వక సామర్థ్యపు వచనాలు! దానికి యువరాజులుంగారేమో,..వారే ధర్మ ప్రవక్తలు గాను,దాన

కర్ణులుగాను,సత్య హరిశ్చంద్రుడి అపర అవతార పురుషుడి గాను వాగ్దానం చేయుట! ఇదంతయూ మహా మంత్రుల పన్నాగమా!లేక రాజ గురువుల ధర్మాచారమా! అదియునూ గాక మహా రాజుల నిఘూఢ తంత్రమా?"

అంటూ పెద్దలపైన నిప్పులు చెరిగిన విక్రమ వర్మ ప్రవర్తన చూచిన సభాసదులకు, రాజ గురువునకు, కడకు కన్న తండ్రికి కూడా ఆశ్చర్యంతో కూడిన ఆగ్రహం కలిగించినది!దండించుటకు ఇది సమయం కాదు.అందుకు ఇది అనువైన ప్రదేశం కూడా కాదు అనుకొని-సామరస్యంగా బోధించడమే సమతుల్య భావనగా ఎంచిన మహారాజు విక్రమ వర్మను ఉద్దేశించి...

మహారాజు:- "విక్రమవర్మా! ఏవిటిది నాయనా ఎందుకిలా ప్రవర్తిస్తున్నావు? నిండు సభలో నీవిలా మాట్లాడటం సభ్యతగా ఉన్నదా?ఇందరి పెద్దల మధ్యన ఇలాగేనా మాట్లాడేది?"

అంటూ అనునయ పూర్వకంగా అభ్యర్ధనలా అర్ధించే తండ్రి మాటలను,తిరస్కార భావంతో తృణీకరించే స్థితిలో నున్న విక్రమ వర్మ పరిస్థితి చూసిన మహామంత్రి,... మహా రాజును వారించి, తాను నచ్చ జెప్పే ప్రయత్నంగా...

మహా మంత్రి:- "చిన బాబు! ఆవేశ పడకండి ఇందులో ఎవరి కుతంత్రం ఏమాత్రము కూడా లేదు.మీ తండ్రి గారికి వయసు మళ్లడం చేత,రాజ్య భారాన్ని వహించడం వారికి కష్ట తరంగా వుండి,పెద్ద వారైన మీ అన్న మార్తాండ వర్మ గారికి పట్టము కట్టుచున్నారు. ఇందులో మా పెద్దల ప్రమేయము ఇసుమంతయును కూడా లేదు.పైగా ఇది మిమ్ములను అగౌరవ పరచినట్లుగా ఎంత మాత్రమును కాదు. వంశాచార ప్రకారం పెద్దవారికే గదాపట్టము కట్టునది! మరి ఇందులో అధర్మ మేమున్నది?"

రాజ్యాధి కారము ఆచార ప్రకారమే జరుగు తున్నట్లు గాను, ఇందులో తాము నిమిత్త మాత్రమే..నన్నట్లు గాను,అభి వ్యక్తం గావించే ప్రయత్నము-ఏదో కొంత చేయ గలిగా ననుకున్న మహా మంత్రి మాటలకు విక్రమ వర్మ...

విక్రమ వర్మ:- "మహా మంత్రుల వారి సమర్ధనమతి భ్రమణానికి దారి తీస్తుందేమో! యోచించి మరీ సూచించండి మీ మర్మ శిద్ధాంతాలలో గల ధర్మ కారణాల్ని!"

అంటూ మహామంత్రిపైన, అగ్గిమీద గుగ్గిలమే అయ్యాడు విక్రమ వర్మ! నిండు సభలో,ఇందరి పెద్దల ఎదుట, ఇంతటి తృణీకార ధోరణలో తనను ఇంతలా అవమాన పరచడం జీర్ణించుకోలేని మహామంత్రి, విక్రమ వర్మను ఉద్దేశించి.."

మహా మంత్రి:- "చిరంజీవి! ఆలోచన లేని ఆవేశాలు, అనర్ధాలకు దారి తీస్తాయని గ్రహించండి! హద్దులు దాటక, పెద్దవారి సూక్తులకు-బద్దులమై యున్నాము గనుకనే, ఇంత కాలం ఈ గద్దపైన నిలిచి పాలించ గలిగామని విశ్వశిస్తున్నాము.మీకు బుద్ధులు నేర్పేటంతటి సమర్ధులము మేము కాక పోయినా... ఏదో బుద్ధికి తోచిన విధంగా..!"

అంటూ మరింకేదో కొంత బోధ చెయ్యాలని ప్రయత్నించే మహా మంత్రిని,ఇంకెంత మాత్రం కూడా మాట్లాడ నివ్వడం భావ్యం కాదను కున్నాడో; పెద్దల మాటలు కడదాకా వినే ఓపిక ఆవేశపరుడికి,ఆలోచనా రహితుడికి ఉండవని రుజువు చేయ సంకల్పించాడో తెలియదు గాని, మహా మంత్రి మాటలకు మధ్యలోనే అడ్డు తగులుతూ...

విక్రమ వర్మ:- "పచించా నంటారా? చాలించండి మీ ముతక శిద్ధాంతం! అన్నయ్య అధికార హొదాలో అంతస్తులను అధిగ మిస్తుంటే...తమ్ముడు తల్లి ఒడిలో పాలు త్రాగుతూ,పిల్ల వాడిలా ఉండమనే సూచిస్తుంది మీ మర్మ శిద్ధాంతం! ఇలాంటి అధర్మ సిద్ధాంతాలకు బద్ధుడనై యుండే మంద భాగ్యత నాకు లేదు.నాకూ సమాన హక్కు కావాలి! అందు కొరకై ఎంత వరకైనను పోరాడగలనని మరచి పోకండి!"

అంటూ విక్రమ వర్మ తన మనసులో ఎంతో కాలంగా దాగి వున్న ఆశను,తండ్రిపైన, అన్నపైనను, కడకు అందరి పెద్దలపైనా తనకు గల అక్కసునూ,

అసహ్యాతను ఇంత నిర్భయంగాను, నిర్మొహ మాటం గాను చాటు కొంటూ, రాజ్యాంగ స్ఫూర్తినే ధిక్కరించే స్థాయికి దిగజారి పోయాడు!

ఇతగాడి వంది మాగదులు కొందరు,ప్రజా గేలరీల నుండి 'విక్రమ వర్మకు అర్ధ రాజ్యం పంచ వలసిందే నంటూ, అరుపులు కేకలతోనూ, పెద్దలకు విజ్ఞులకు ఏహ్యా భావం కలిగేలా ప్రవర్తించ సాగారు! ఇక తను కల్పించు కోక తప్ప దనుకున్న మహా రాజు విక్రమ వర్మను ఉద్దేశించి..

మహారాజు:- "విక్రమ వర్మా! ఏవిటి నాయనా ఇది! మహా మంత్రినే అవమా నిస్తున్నావ? విజయ నగర సామ్రాజ్యానికి వెన్నెముక వంటి విజయ సేనుని నిండు సభలో పరాభ వించడమా! ఇంటి విషయాలను రచ్చ కీడ్చింది గాక, కంటికి రెప్పలా రాజ్యాన్ని కాపాడే మహా మంత్రిని...."

అని మహారాజు అంటూండగానే విక్రమ వర్మ ఆగలేక పోయి,మధ్యలోనే అందుకున్నాడు..తనపైన ఏదేదో చెప్పి,తన మనసు మార్చాలని ప్రయత్నించే వీళ్ల ఆటలు సాగ నివ్వ కూడ దనుకున్నాడు! వాళ్లంతా ఉత్తములుగా చెప్పుకొంటూ, తనను మాత్రం అశ పోతుగాను,ఆత్రగాడి గాను చిత్రించిచూపించాలనుకోవడం, ఎంత మాత్రం క్షమార్హంగాని నేరంగా భావించి- మహారాజుతో...

విక్రమ వర్మ:- "అనరాని మాట లంటున్నాను కదూ? నిజమే! ఒక్క మహామంత్రినే కాదు కన్న తండ్రిని, తోబుట్టువు సోదరుణ్ణి, సకల ప్రజానీకాన్ని కూడా ధిక్కరించ వలసి వచ్చి నందుకు నాకూ బాధగానే ఉంది! కాని.. ఏం చెయ్యను, ప్రస్తుత పరిస్థితులు, మీరు అనుసరిస్తున్న తీరు నన్ను ఇలా మాట్లాడేలా ప్రోత్సహించాయి, ఉసి గొల్పాయి! ఇందుకు మీరే కారకులు మీరూ, మీరూ, మీరు! మీరంతా కలసి నన్ను వొంటరి వాణ్ణి చేసి, తుంటరి వాడిగా మార్చి వేశారు!

కట్టలు తెగిన ఆవేశం కళ్లు మూసుకొని పోయేలా చేసింది! పదవిపైన వ్యామోహం పేగు బంధా న్ని సైతం ప్రశ్నించేలా చేసింది! ఆత్మద్రోహం,నీచ సంస్కారాలను పాదు గొలిపింది! చెడ్డస్నేహం దుష్ట స్వభావాన్ని పెంపు గావించింది. అదే ఈ సంస్కార హీనతకు కారణం, సంఘ విద్రోహిలా మారుటకు ప్రేరణం! ఇక మార్తండ వర్మ చూస్తూ ఉండలేక పోయాడు తనుకూడా నచ్చ చెప్పాలని ప్రయత్నిస్తూ విక్రమ వర్మతో...

మార్తాండ వర్మ:- ఇందులో నిన్ను అన్యాయం చెయ్యాలనే దురభిప్రాయం మనలో ఎవ్వరికిని లేదు మన పూర్వులంతా వంశానికి పెద్ద వాడికే పట్టం కట్టడం ఆచారంగా వస్తున్నందున,అటువంటి ఆచారాన్ని కాదన డానికి గాని, కాలరాయడానికి గాని, మనసంగీకరించక, పెద్దలు నాకీ బాధ్యతను అప్పగించ నిశ్చయించారు.ఒకవేళ నీకిది సమంజసంగా లేక పోతేనో, పెద్దలు చేసిన యీపని శాస్త్ర సమ్మతంగా తోచక పోతేనో, లేక రాజ్యాధికారాన్ని నేను చేపట్టడం నీకు ఇష్టం లేకపోతేనో, ఈ రాజ్య భారాన్ని నీవే వహించు నేను కాదనను!"

అంటూ తన పెద్దరికాన్ని, హద్దులు తెలియ నంత ఎత్తుకు ఎదిగేలా చేసుకొని మాట్లాడాడు మార్తాండవర్మ! తమ్ముడిలో అసలు ఇలాంటి అభిప్రాయం చోటు చేసుకొన్నట్టు, ముందు గానే తాను పసి గట్టి గనుక ఉండి వుంటే! దీనికి కారకు లెవరో తెలుసుకొని, దాని నివారణ మార్గ మేవిటో అన్వేషించి, ఆ తరువాత మాత్రామే ఈ కార్యక్రమానికి శ్రీకారం గావించి యుండెడి వాణ్ణి! అని మార్తాండవర్మ మదన పడ సాగాడు.అందుకే తమ్ముడి కైనా అధికారపీఠం అప్పగించడానకి ఏమాత్రం కూడా ఆలోచించలేదు; ఏ కొంచం కూడా ఆవేదన చెందలేదు! దానితో విక్రమవర్మలో మరింత ఉక్రోషం ముంచుకొచ్చింది..

విక్రమ వర్మ:- మీ త్యాగ బుద్ధి పదుగురెదుట వ్యక్త పరచి, నా కౄరత్వాన్ని రుజువు చెయ్యమని కాదు మిమ్మల్ని నేను కోరేది! శాస్త్ర సమ్మతంగా ఆస్థిని పంచ మంటున్నాను! అంతేగాని...ఇతర సంపదలతో, మతి లేని విధంగా కులికేటంత గతి మాలినవాణ్ణి కాను నేను! మీరు దయ తలచి ఇచ్చిన దానాన్ని అప్పనంగా దొరికిన అదృష్టంగా భావించి,చప్పరిస్తూ కూర్చోవడానికి...మీచెప్పు చేతలలో పడి ఉండటానికి!"

దయార్ద్ర హృదయుడి దానం కూడా ఒక్కోసారి వికటించి ఇలాగే అపాత్ర దానం గాను,అనాలోచిత నిర్ణయంగాను, అభాస పాలు కావడం జరుగుతూ ఉంటుంది! అదే జరిగింది విక్రమవర్మ విషయంలో కూడా! తమ్ముడు గదా అని అను బంధాన్ని యోచించి, ఈ సూచన గావించితే...అది ద్వేషించే స్థాయికి వెళ్లి క్రోధాన్ని పెంచే స్థితికి తెచ్చింది!ఇక మార్తాండ వర్మ లో సహనం సన్నగిల్లింది. సామరస్య ధోరణి ఇతగాడితో సానుకూలత కాదనిపించింది.

మార్తాండవర్మ:- "విక్రమ వర్మా! అతిగా మాట్లాడుచున్నావు! నీతికి గోతులు త్రవ్వే, పాప భీతి తెలియని జాతికాదు మనది!"

అంటూ ఒకింత ఉద్రేకాన్ని అపుకొనే ప్రయత్నం చేస్తూనే,విక్రమ వర్మ రెచ్చగొట్టే మాటలకు-ఆవేశం చెందకుండగ ఉండలేక పోతున్నాడు! తన మంచి తనాన్ని చేతగాని తనంగానో,చావ చచ్చిన విధంగానో భావిస్తాడనే, జాతి ఔన్నత్యాన్ని ఆ మాత్రంగా ఏకరువు పెట్టవలసి వచ్చింది అందుకు విక్రమ వర్మ స్పందిస్తూ...

విక్రమ వర్మ:- "ఆ ఖ్యాతిని శాశ్వతంగా నిలపాలనే ఉద్దేశంతోనే,మిమ్మల్ని పలు మారులు హెచ్చరిస్తున్నది! అపఖ్యాతిని అర్థించినా,విఖ్యాతిని విసర్జించినా అది మీరేనని గ్రహించండి!"

అంటూ తత్వ బోధను తారక మంత్రంలా,అగ్రజుడికే బోధించాలని ఆరాట పడ్డాడు విక్రమ వర్మ! అది ఎందరికి బాధ కలిగిస్తుందో,మరెందరిలో వేదన రగిలిస్తుందో,మూర్ఖత్వం మెండుగా గలవాడికి-ఏమి అనిపిస్తుంది, ఎలా కనిపిస్తుంది? ఇక మహారాజు చూస్తూ ఉండలేక...

మహారాజు:- "విక్రమవర్మా! మేము అక్రమంగా మాట్లాడు చున్నామా? నీవు సక్రమంగా ఈ రాజ్యంలో ఉంటే.. నీకు ఏ హక్కు లేకుండా పోయిందని ఇంత ఆర్భాటం చేస్తున్నావు! నీ స్వేచ్ఛను కాదని ఇక్కడ నిన్ను అడ్డగించిన వాళ్లెవరున్నారు?.."

అంటూ పాపం! మహారాజు కూడా వేదన నిండిన స్వరంతో, స్వామికి తన నివేదన విన్నవించుకున్న విధంగా, విక్రమ వర్మకు తన ఆవేదన తెలియ జేసుకున్నాడు. అయినా-పాషాణ హృదయుడికి పార దర్మకత లోపించి నట్టు...,పాప పుణ్య ప్రాశస్త్యత ఎలా అర్థ మవుతుంది;ఎప్పుడు తెలిసి వస్తుంది?

విక్రమ వర్మ:- "ఇంత వరకు అటువంటి మాట రాలేదు.అలా నన్ను అడ్డగించిన వాళ్లులేరు. అందుకు కారణం లేకపోలేదు. ఇప్పటి వరకు సాగినది మీ పరిపాలన. ఎంతైనా నేను మీ బిడ్డనైన కారణంగా నేనెలా ప్రవర్తించినా, నాకు ఎవరూ అడ్డు చెప్పక పోయి ఉండి వుండవచ్చు. ఆ మాత్రం చేతమును ముందు కూడా ఇలాగే జరుగు తుందని గ్యారంటీ ఏవిటి?

గతించిన కాలంతో, రానున్న కాలాన్ని ముడి పెట్టటం విజ్ఞులైన వారికి వివేకం అనిపించు కోదు; వినోదం కూడా కలిగించదు కనుక, గతించిన కాలంవేరు...జరుగ నున్న పరిస్థితులు వేరు అన్నదమ్ముల అను బంధం శాశ్వతంగా ఉండాలనుకుంటే– కన్న వారిలో కరుడు గట్టిన కల్మష వాంఛ దూరం కావాలి! పుత్రవాత్సల్యం దగ్గర కావాలి!"

భవిష్యత్ వాణిని బ్రంహ్మాండం బ్రద్దలగు నంత గొప్పగా వివరించి చెప్పగల విక్రమ వర్మ దూర దృష్టికి,మరొక తండ్రి అయి ఉంటే అచ్చెరు వొందేవాడు, అభినందన గావించే వాడు! కాని..ఈ తండ్రికి అంతటి ప్రజ్ఞా పాటవాలు లేని కారణంగాను,ఆచార వ్యవహారాలు,పూర్వీకుల సాంప్రదాయ పద్ధతులు పాటించే స్వభావం కావడం చేతనూ...

మహారాజు:– "నీపై నేను కల్మష హృదయంతో మాట్లాడు చున్నాన! లేదు నాయనా లేదు! ఏ జన్మలో చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగానో, నీపుట్టుకతో నా పట్టపు రాణిని దూరం చేసుకున్నాను. అర్ధాంగి దూరమైనా,ఈ వృధాప్యంలో మీరిద్దరూ నా రెండు కళ్లుగా భావించి పెంచాను. ఈ రోజున ఇంత వాళ్లను గావించాను!"

అంటూ ఇతగాడికి జన్మ నిచ్చిన రోజునే తన అర్ధాంగి, (సహ ధర్మ చారిణి), పట్టపు రాణియు నగు భార్యను పోగొట్టుకున్న రోజును ఒక్క సారిగా గుర్తు చేసుకొని,మనసు భారమై మాట పెగలక,తనలో తాను కుమిలి పోతూ ఉన్న తండ్రితో విక్రమ వర్మ..

విక్రమ వర్మ:– "అందుకే ధర్మ బద్ధంగా అడిగి, అర్ధ రాజ్య మివ్వ మంటున్నాను! నన్నుకూడా సమాన దృష్టితో చూడ మంటున్నాను; పాత ఆచారాలకు పాతర వేసి, సరికొత్త సాంప్రదాయాన్ని పాదు గొల్ప మంటున్నాను.ఆదర్శ తండ్రిగా అగ్రభాగాన నిల్చి, తమ శేష జీవితాన్ని ఏ రామకోటి రచనతోనో గడిపేయ మంటున్నాను. అది మీకు సమ్మతం కాదను కుంటే చెప్పండి! మేమూ పరాయి రాజుల వలెదండెత్తి...."

**అంతటి మాట తన బిడ్డ నోట వినడం తోటే,మహారాజు నిశ్చేష్టుడయ్యాడు!నోట మాట రాక, అతగాడినే చూస్తూండి పోయాడు! మార్తాండవర్మ మాత్రం ఆలోచించ**

సాగాడు, ఈ విపరీత బుద్ధి వీడికి కలిగింది కాదని! సభా సదు లందరూ నిర్ఘాంత పోయారు! రాజ గురువు మాత్రం-ఇది వినాశ కాలపు విపరీత బుద్ధిగా తలచి మహారాజు స్పందన ఎలా ఉంటుందా...అని వేచి చూశాడు. మహారాజు లో క్రోధాగ్ని ప్రజ్వరిల్ల సాగింది 'దండెత్తడం' అనేమాట ఆయనను దహించి వేసింది!అది గ్రహించిన రాజ గురువు తానే కల్పించు కొని...

రాజ గురువు:- విక్రమవర్మా! హద్దు మీరి మాట్లడుచున్నావు. సభా మర్యాదను కూడా అతిక్ర మిస్తున్నావు. నీవు ఈరాచరికపు బిడ్డగా మర్చిపోయి మరీ మాట్లాడు చున్నావు! పదుగురిలో మాట్లాడ వలసిన మాటలు పరి పక్వతచెందినవిగా వుండాలిగాని, పసితనం ఉట్టి పడేలా ఉండ కూడదు; నలుగురిలో నగుబాటు చెందేవిలా ఉండ కూడదు నాయనా!"

అని కొంత మందలిస్తూనే, మరి కొంత హితబోధ చేసే ప్రయత్నం చేశాడు రాజ గురువు. అటువంటి బోధలు వినే స్థాయిలో విక్రమ వర్మ లేక పోవడంతో,అందరి ప్రయత్నాలు వృధా అగుచున్నవా...అన్న భావనగా విక్రమ వర్మ కల్పించుకొని..

విక్రమ వర్మ:- "అధిక ప్రసంగం! నేనడుగు చున్నది నాకు సక్రమంగా సమాధానం చెప్పండి! ప్రభువులకు జన్మించినది మార్తాండవర్మ. ఒక్కడే ననుకున్నారా! సర్వ స్వతంత్రాలు తన హక్కుచేసి,సకల సామ్రాజ్యమూ తనకు స్వాధీనం చెయ్యడానికి! మరో యువరాజు విక్రమ వర్మ ఉన్నాడనిగాని, సకల సామ్రాజ్యాన్ని పరి పాలించేది ఒక్క మార్తాండనర్మ మాత్రమే కాదని, మహా మంత్రులకు,రాజ గురువునకు, ప్రజలకు, దేశ నాయకులెల్లరకూ జ్ఞప్తి లేక పోవచ్చు! అర్ధపాలు రక్తము నాకు ధార పోసిన,మహా రాజు కు కూడా మతి భ్రమించెనా! లేక కావలెననే ఇలా జరిపించెనా?"

రాజ గురువు పైన గౌరవం లేదు! తండ్రి పైన అభిమానము లేదు!తోడ బుట్టిన సోదరుడి పైన కూడా నమ్మకం లేదు!కడకు పూర్వీకుల సాంప్రదాయ పద్ధతుల పైననే అసలు విశ్వాసము లేదు! దుష్టుల సహవాస దోషం-దూర దృష్టిని సైతం 'భ్రష్టు' గావిస్తుందను చెప్పడానికి,ఇంతకంటే నిదర్శన మింకేమి కావాలి? అయినా మహా రాజా ఈ హాయించు కొని, దుఃఖాన్ని దిగమ్రింగుతూ...

మహా రాజు:- "నాయనా విక్రమ వర్మా! అలా అనబోకు నాయనా నాకు మీరు ఇరువురూ సమానులే! కత్తి పట్టి మీరు ఏనాడు కదన రంగానికి కాలు దువ్వెదరా యని పరితపించిన ఈ తండ్రి హృదయానికి నిఘూడ తంత్ర మే ముంటుంది నాయనా?"

అంటూ తన సాధ్వీకతను సామ దాన దండో పాయాల ద్వారా తెలియ జెప్పాలని, తండ్రిగా తన హుందాతనాన్ని నిలుపు కోవాలని, సభా సదుల ముందు పెద్దల ముందు తేలిక కాకూడదని, అనేక విధాలుగా నచ్చ చెప్పి చూసే ప్రయత్నం చేసి చూశాడు. కాని ప్రయోజనం లేక పోయింది!

విక్రమ వర్మ:- "అయినా మీ మంత్రాలతో, తంత్రాలతో నాకు అనవరం. ఇంత కాలము తండ్రి గారి రాజ్యపాలన గదా యని, రాజ్య భాగాల సంగతి మాట్లాడ కుండగా యూర కున్నాను! ఇప్పుడు రాజ్యాధికారము మార్పు చెందుతూ, అంత దూరము రానే వచ్చింది గనుక...నా అర్ధ రాజ్యము నాకు పంచి ఇవ్వండి!"

అన్నాడు నిష్కర్షగా! మరెలాంటి సమర్ధింపు తనకు సమ్మతం కాదని చెప్పకనే చెపుతు! ఏం చెయ్యాలో మహారాజుకు అర్థం కావడం లేదు! ఇలా చెయ్యండని చెప్ప డానికి పెద్దలకు మనసు రావడం లేదు! తొందరపడి తనేదైనా మాట్లాడితే, ఆ తరువాత అది ఎటుపోయి ఎటు వస్తుందోనని మార్తాండ వర్మ మదన పడ సాగాడు. ఈ క్రమంలో మహా రాజు కల్పించుకొంటూ...

మహా రాజు:- "విక్రమ వర్మా! అసలు దేనికి నాయనా ఈ రాజ్యా భాగాలు?ఇప్పుడు నీకు ఇక్కడ వచ్చిన కొరత ఏమిటి?రాముడిలా అన్న రాజ్యాన్ని పట్టము కట్టు కొంటున్నాడు అంటే, లక్షణుడిలా సంతోషించ వలసిన నీవు! కైకేయిలా క్రౌర్యాన్ని ప్రదర్శిస్తూ, కలహానికి కాలు దువ్వుతూ, ఈ విధంగా రాజ్యాన్ని రెండు ముక్కలు గావించమని, ఇలా మాట్లాడు చున్నావు!"

అంటూ మైకం కమ్మిన వాని వలె మహా రాజు తన ఆసనముపై తలవాల్చి ఒక ప్రక్కకు వాలి పోయాడు!అది గమనించిన మహా మంత్రి సేవకుడితో నీళ్లు తెప్పించి ముఖాన చికరించగా,నీరశించిన వదనంతో కళ్లు తెరచి, దిగాలుగా కూర్చుండి పోయాడు మహా రాజు! ఇదేమీ పట్టని విక్రమ వర్మ తన ధోరణిని కొన సాగిస్తూ..

విక్రమ వర్మ:- "అవును సంతోషించాలి! అది ఎలాంటి విషయమైనా సంతోషించాలి. అలా ప్రతి విషయాన్ని సంతోషిస్తూ ఉండమని, మన విజయ నగర సామ్రాజ్యపు చట్ట సూక్తులలో, మొట్ట మొదటగా ఎక్కడైనా లిఖింపబడి ఉన్నదా? పదే పదే అదే విషయంగా ఆరాట పడు చున్నారు; ఆవేదన చెందు చున్నారు?"

అంటూ విక్రమ వర్మ వెటకార ధోరణిలో మాట్లాడ సాగాడు. మార్తాండ వర్మ ఇక ఉండ

బట్టలేక పోయాడు. తానుకూడా నచ్చ చెప్పే ప్రయత్నంగానే మాట్లాడుతూ విక్రమ వర్మతో..

మార్తాండ వర్మ:- "చూడు తమ్ముడు! మనవంటే గిట్టని వాళ్లు, మనపైన అనేకం కల్పించి చెపుతూ ఉంటారు! అలాంటి చెప్పుడు మాటలన్నీ తలకెక్కించుకొని, నిప్పులాంటి మన వంశాన్ని -తప్పు త్రోవ బట్టిస్తావా? ఈ విధంగా వ్యవహరిస్తూ, పెద్దలను ధిక్కరించేలా ప్రవర్తించడం, నీకెంత వరకు సభ్యతగా తోచింది?"

అంటూ ఒకింత తానూ తండ్రిలా, నిస్సత్తువతో కూడిన నీరసస్థితికి లోనయాడు! వివేకాన్ని బోధించడం విజ్ఞత అనిపించు కొంటుంది గాని, వినే వ్యక్తిలో చైతన్యం కలగ నప్పుడు అది చాదస్తంగా మారి పోతుంది; చపల చిత్తంగాను రూపు దాలుస్తుంది! అదే విక్రమ వర్మలో ప్రస్పుటంగా కానవచ్చింది!

విక్రమ వర్మ:- "మీ దెప్పి పొడుపు మాటలు వినడానికి నాకిప్పుడు వ్యవధి లేదు! ఈ నిప్పులు లేచి మీకు, మీరాజ్యానికి ముప్పుకలిగించక ముందే... నే నడిగిన అర్ధ రాజ్యంనాకివ్వ టానికి-మేమొప్పుకున్నాము.' అనే సమ్మతిని తెలియ జేయండి చాలు!"

అంటూ విక్రమ వర్మ తన ధోరణినే తాను కొనసాగిస్తూ రాసాగాడు. అన్నదమ్ముల వాదన ఎక్కడ ఆగ్రహానికి దారి తీస్తుందోనని, తండ్రిగా తాను కొడుకు ఎన్నన్నా పడటం-అనాదిగా వస్తున్న ఆచారమే గనుక-అన్న దమ్ముల మధ్య మాత్రం...వైషమ్యాలు కలక్కుండా చూడాలని, పెరక్కుండా చెయ్యాలనే ప్రయత్నంగా...

మహారాజు:- " నాయనా విక్రమవర్మా! ఈ పెద్ద వయసులో నీకు అంతగా చెప్పవలసిన అవసరం లేదను కుంటాను. తరతరాలుగా మన పెద్దలు ఈ రాజ్యన్ని పరిపాలిస్తూ వచ్చారు. వాళ్ల అడుగు జాడల్లోనే నేనూ ఇంత కాలం ఎలాంటి కష్టం, ఏ ఒక్కరికి కలక్కుండగా పరిపాలన గావిస్తూ వచ్చాను!నా తరువాత నా వారసులు కూడా మా దారిలోనే నడుస్తా రనుకున్నాను గాని, ఇలా రాజ్యాన్ని తునా తునకలు చేసి,అల్ల కల్లోలంగా ప్రజలకు హాని కలిగించడం నాకిష్టం లేదు! నాకిష్టం లేదు నాయనా!"

ఇప్పటి వరకు కొంత మెతక వైఖరితో కన్పించిన మహారాజు నోటివెంట, రాజ్యము పంచడం ఇష్టం లేదనే ధృడ సంకల్పపు మాట రావడం- ఏ కొద్ది మందికో బాధ కలిగించినా,ఎక్కువ మందిలో మోదమే కన్పించింది! మహారాజు నిర్ణయం ఆమోద యోగ్యంగాను అనిపించి, 'రాజ్యం విడి పోవడానికి వీల్లేదు, అన్నదమ్ములు కలిసే ఉండాలంటూ ప్రజల్లో నుండి అరుపులు,కేకలు వినిపించ సాగాయి! ఆ కేకలకు విక్రమ వర్మకు బాగా చిర్రెత్తుకొచ్చి...

విక్రమ వర్మ:- "ఎలా పంచరో...ఎందుకు పంచరో మేమూ చూస్తాం! మీకు ఇష్టం లేకపోతే మేమే తీసుకో వలసి ఉంటుంది! తండ్రిగారు, అన్నగారు ఇష్ట పడనప్పుడు, అందుకు యుద్ధమునకే శిద్ధము తెలిపి నట్లు కాబోలు! అదీ చూస్తాం!."

అని చిర్రు బుర్రు లాడుతూ, అందరిపైన కారాలు మిరియాలు నూరతూ, కాలు గాలిన పిల్లిలాగ ఒక చోట నిలువలేక,అదే పనిగా అటు ఇటూ తిరుగ సాగాడు. ఇక వీడితో సామరస్యంగా మాట్లాడి ప్రయెజనం లేదనుకున్న మార్తాండ వర్మ...

మార్తాండ వర్మ:- "అడవిలో కూర్చి ఉంచిన మూకతో, మా మీదకు దండెత్తుతావ?

అని అతగాడి బలగాన్ని బయటపెట్టేడు మార్తాండ వర్మ! కొద్ది రోజులుగా ఇతను గావిస్తున్న సహవాసాలు ఆనోట, ఆ నోట వింటూనే ఉన్నాడు. కాని తండ్రికి చెప్పలేదు. తను కూడా దాన్ని పెద్దగా పట్టించుకోలేదు.

విక్రమ వర్మ:- "అంతదూరం రానివ్వ దలచు కున్నారా? మహారాజా ! మిమ్మల్ని స్వయంగా అడుగు చున్నాను. నాకు సక్రమంగా సమాధానం

చెప్పండి!"

మీ అందరితో నాకు పనేవిటి; నాకు సమాధానం చెప్పవలసింది మహారాజు మాత్రమే నన్నట్టుగా, ఆయన్నే నిలదీసి అడిగాడు విక్రమ వర్మ.

మహారాజు:- "విక్రమ వర్మా! నీ పట్టు నీదేనా? నీ ఇష్టాను సారంగా తిరుగుతూ, నీ ఇష్టం వచ్చినట్టుగా ప్రవర్తిస్తూవుంటే,దేశము నాశన మవ్వ వలసిందేనా? ఇంతటి అన్యాయానికి ఒడిగట్టి, ఇలాంటి క్రూర హింసకు ఏల తలపడితివి నాయనా!"

అంటూ తల పట్టుకొని,తల పండిన వాళ్ల ముందు –తల దించుకొని కూర్చుండి పోయాడు మహారాజు!

విక్రమ వర్మ:- "మీ కల్లబొల్లి మాటలతో కాల యాపన చేయకండి! మీరు ఎన్ని విధాలుగాను, ఎన్ని రకాలు గాను చెప్పాలని ప్రయత్నించినా, అది నిష్ప్రయోజనమే నని గ్రహించండి! నేను అడిగిన దానికి సక్రమంగా సమాధానం చెప్పండి!"

ఖరాకండిగా చెప్పేశాడు విక్రమ వర్మ. ఇక సర్దుబాటు ఏ మాత్రం కూడా లేదన్నట్టు!

మార్తాండ వర్మ:- "లేకపోతే...?"

కాదంటే ఏంచేస్తావో చెప్పమని,మార్తాండ వర్మ కూడా ఏ మాత్రం వెనక్కు తగ్గకుండనే అడిగాడు. ఎంతగా సహనం వహిస్తూ వచ్చినా,అతగాడి రెచ్చగొట్టే ధోరణి అమితంగా చికాకు కలిగించ సాగింది, చిరాకూ అనిపించ సాగింది!

విక్రమ వర్మ:- "జరగ వలసిందే జరుగుతుంది! చూస్తూవుండండి ఏం జరుగుతుందో! మహారాజా! ఇదేనా మీ ఆఖరి నిర్ణయం?"

అంటూ విక్రమ వర్మ తండ్రిని ఆఖరి ప్రయత్నంగా నిలదీసి అడిగాడు! మహారాజు లో కూడా ఇంతవరకూ వహించిన సహసం పూర్తిగా నశించి నట్లుంది!

మహారాజు:- "నేను బ్రతికి ఉన్నంత వరకు రాజ్య భాగాలు జరగనివ్వను! అక్రమానికి శిద్ధమై, అన్యాయంగా రాజ్యాన్ని నాశనం చేస్తూవుంటే,

చూస్తూ ఊరుకోను!"

తెగేసి నట్టుగా చెప్పేశాడు మహారాజు! ఏదైనా తెగిందాకా లాగడం-తెలివి తక్కువ తనమని గ్రహించలేక పోయాడు పాపం విక్రమ వర్మ!

విక్రమ వర్మ:- "అంతేనా? నా తరఫున మాట్లాడేవాళ్లు సభలో ఏ ఒక్కరూ లేరా? ప్రభువులకైతే రాజగురువు మద్దెల వాయించి మరీ మాట్లాడ తారు గదా! మరి నా విషయం వచ్చేసరికి అందరూ మవునం దాలుస్తున్నారు! నాకున్న హక్కును సభా ముఖంగా ప్రశ్నించినా,ఏ ఒక్కరూ మాట్లాడరా?సరే..!మహారాజా చెప్పండి!అంతేనా?"

ఎవరి నుండీ తనకు మద్దతు లభించక పోవడంతో, గతి దప్పిన వాడిలా,మతిలేని విధంగా,నీతిమాలి ప్రవర్తించ సాగాడు విక్రమ వర్మ!

మార్తాండ వర్మ:- ముమ్మాటికి అంతే! దండెత్తు తానని నీవు ప్రకటించిన నీ ప్రగల్భానికి భయపడి ఈ రాజు నీకు రాజ్యాన్ని పంచితే, ఇంతవరకూ కాపాడు కొంటూ వచ్చిన ఘనకీర్తి ఏమైపోవాలి?... ఇచ్చట నివశించే ప్రజల పరువు మర్యాదలేమై పోవాలి? అందుకని ఇక్కడ చావ చచ్చిన వాళ్లెవ్వరూ లేరు! నీకు చేతనైనదేదో నువ్వు చేసుకో!"

ఇక వీడితో మాటలు అనవసరం అనుకున్న మార్తాండవర్మ,అదే తీరులో, అంతే దూకుడుగా సమాధన మిచ్చాడు! ఆ విధంగా మాట్లాడి మాత్రమే వాణ్ణి దారికి తేగలం గాని, మెతక తనంవాడి ముందు పని చేయదని, చిన్న తనం నుండి అతగాడి స్వభావం తెలిసున్న అన్నగనుక, కీలెరిగి వాత పెట్టేడు!

విక్రమ వర్మ - "రాజ్య భాగాన్నే తీసుకుంటానో,..పూర్తిగా రాజ్యాన్నే చేజిక్కించు కుంటానోచూద్దురు గాని. అన్నయ్యా! కాదు...మార్తాండ వర్మా! సింహాన్ని రెచ్చగొట్టావు! అదిఘర్జించి, ఏ క్షణంలో నైనా మీ పైన విరుచుకు పడుతుంది జాగ్రత్త!"

అంటూ పట్టరాని ఆవేశంతో, కట్టలు తెగిన వాగులాగ-నెత్తుటి ఏరులు పారగలవని, పరుషోక్తులు పదే పదే వల్లె వేస్తూ వెళ్లిపోయాడు విక్రమ వర్మ!

మహారాజు:- "నాయనా...విక్రమ వర్మా!...నాయనా..,విక్రమ వర్మా!

అంటూ ఆపుకోలేని దుఃఖాన్ని అదుపు చేసుకొంటూ,ఆర్తి గాను, అభ్యర్ధన గాను పిలిచాడు మహారాజు విక్రమవర్మను! తిరిగైనా చూడకుండగా అదే ఊపులో వెళ్లి పోయాడు విక్రమ వర్మ.

(మొదటి రంగం సమాప్తం)

## (2వ రంగం)

అది ఒక కొండ గుహ. దట్టమైన అడవి మధ్యన పట్టపగలు కూడా భయాన్ని కలిగించే ప్రదేశమది!గతంలో అది బందిపోట్ల స్ధావరంగా ఉండేది. వాళ్ల ఆగడాలు ఒకప్పుడు యధేచ్ఛగా ఈ రాజ్యంలో కొన సాగుతూ ఉండేవని,ఆక్రమంలో వాళ్లు కుటుంబాలతో కలిసి ఆ గుహలో తల దాచుకోవడమే కాకుండగా, కాపురాలు కూడా చేస్తూ ఉండే వారని

తలపండి ఇప్పటికీ జీవించి ఉన్న శత సంవత్సరాల వృద్ధులు కొందరు కధలుగా వాళ్ల పిల్లలకు చెపుతూ ఉండేవారు! ఆ వృద్ధుల వారసులైన రాజోద్యోగులు అప్పుడప్పుడు వాళ్ల సమా చరులతో, ఆ విషయాలు ప్రస్ధావిస్తూ ఉండడం జరుగుతూ ఉండేది!

ఆ విధంగా బందిపోట్లు కొంత కాలం (అంటే కొన్ని సంవత్సరాల పాటు) వాళ్లు ఆ గుహలోనే కాపురాలుంటూ, దరి దాపులలో గల గ్రామాలు, పట్టణాల ప్రజలను భయ భ్రాంతులకు గురిచేస్తూ, వారి ధన మాన ప్రాణాలను సైతం దోపిడి గావిస్తూ, అరాచకం సృష్టిస్తూ ఉన్న సమయంలో – అరి వీర భయంకరుడిలా, మార్తాండ వర్మ తాత గారైన వీరేంద్ర వర్మ విజృంభించి, వాళ్ల ఆగడాలను అరికట్టి –వాళ్లలో భయో త్పాతాన్ని కలిగించి, వాళ్లు ఆ స్ధావరాన్ని సైతం విడిచి వెళ్లేంత పరాక్రమాన్ని ప్రదర్శించాడట!

ఆ తరువాత చాలా కాలంపాటు ఆ గుహ పాడు బడే ఉన్నదట.ఆ క్రమంలో ఒక కోయ గుంపు ఎక్కడి నుండో ఊడి పడి, స్ధావరం కోసం వెదుకు లాడుతూ ఉన్న సమయంలో, కొన్ని దారుల గుర్తుల ఆనవాళ్లు పట్టుకొని, ఆ స్ధావరాన్ని చేరుకొని దాన్ని కొద్ది కొద్దిగా బాగు చేసుకొంటూ,తమ వాళ్లను కొందర్ని కొందర్ని రప్పించు కొంటూ వచ్చి, ఇప్పుడు ఆ గుహలోపల కొన్ని వందల మంది నివశించడానికి

యోగ్యంగా, దాన్ని తయారు చేసుకున్నారట!అలాగ వాళ్లు అక్కడ నివసిస్తూ, వాళ్లు తయారు చేసిన వస్తువులు కొన్ని, ఇత రత్రా వాళ్లు అడవిలో సేకరించిన అనేక రకాల సహజ సిద్ధపు ప్రకృతి సంపదను నగరానికి తెచ్చి, వాటిని అమ్ముకొని పోతూ జీవనం సాగిస్తూ వుండే వారట!

ఆ క్రమంలో విక్రమ వర్మ తన స్నేహితులతో, అడవికి సరదాగా వేటకని వెళ్లడం- అందమైన అప్సరస లాంటి కోయవనిత ఇతగాడి కంట పడడం,-ఆ క్రమంలో ఆమె వెంట ఆ గుహలో ప్రవేశించడం,ఆమె మైకంలో అక్కడి వారితో కలిసి మత్తు పానీయాలు

సేవించడం చేస్తూ, ఆ మగువతో సరస సల్లాపాలు గావిస్తూ,వాళ్ల కోయదొర చెప్పుడు మాటలకు తలొగ్గి-తండ్రితోనూ, అన్నతోనూ వైరానికి కాలు దువ్వ సాగాడు విక్రమ వర్మ!

## 'తెర లేచును'

భేతాళుడు:- "అహ హ హ హ హ...! భేతాళ ఘర్జనలకు, పాతాళాలు కంపించి, భూతాలు సైతము బెదరి పోయాయి! వీరులన బడే ధీరులంతా తారుమార్చై, కారాగృహాలలో బంధింప బడ్డారు! వారికన్నా ఘనుడా ఈ లేత కుఱ్ఱ! వీడి తాత లాంటి వాణ్ణి కూడా గోతిలోకి దించగలం! అరేయ్ వెంకా!"

అంటూ తాగిన మైకంలో వికటాట్ట హాసం చేస్తూ, తన క్రింద పని చేసే వాడితో తన పరాక్రమాన్ని తెలియ జేస్తూ, మరి కొంత అసహనాన్ని ప్రదర్శిస్తూ,అరుపులాంటి పిలుపుతో వాణ్ణి పిలిచాడు భేతాళుడు.

వెంకడు:- "దొరా!...పిలిచారా? చెప్పండి దొర!"

అంతటి భీకర ఘర్జన లాంటి పిలుపుతో దొర తనను పిలవడంతో 'ఏంది దొర? అంటూ అడిగి,దొర ఆదేశం కొరకు ఎదురు చూస్తూ నిలుచుండి పోయాడు వెంకడు.

భేతాళుడు:- "ఇంకా విక్రమ వర్మ చక్రవర్తి రాలేదేమిరా? రెక్కలు గట్టుకు చేరతానని పక్కలు ఎగర వేశాడుగా! ఒక వేళ ప్రభువులు మక్కువ

తీర్చక పోవడంతో కుక్కిన పేనులాగ,కిక్కురు మనకుండా కూర్చోలేదు కదా?"

అంటూ అతని రాకలో గల ఆలస్యానికి-అసహనాన్ని ప్రదర్శిస్తూనే, అనుమానాన్ని కూడా వ్యక్తపరిచాడు! ఎందుకంటే...రాజ్య భాగాన్ని తీసుకొని రావడం, బజారుకెళ్లి మందు బాటిలు కొనగలిగినంత తేలిక కాదని ఆ కోయ దొరకు తెలుసు కాబట్టి! అయినా...అతగాడి ప్రగల్భాలు వింటూ, అతనే పాటి ప్రతాపం గలవాడో చూడాలనుకున్నాడు. అది అంత కంతకు ఆలస్య మవుతూండడంతో, ఆదుర్దా పడసాగాడు భేతాళుడు.

వెంకడు:- "మీరెక్కడోల్లు దొరా! పెతిదీ సందేహమైతె యెట్టా? ఆ కూన పట్టిన పట్టు మన గూడెంలోళ్ళ కట్టుకంటే దొడ్డది దొరా!"

అంటూ విక్రమ వర్మ పట్టుదలపై తనకుగల నమ్మకాన్ని-ఏ మాత్రం సడలించ కుండగాను, ఆలోచించ కుండగాను, ఆ కోయదొర లాగ అనుమానించ కుండగాను, తడుముకో కుండగనే తన మనసులో మాటను అరక్షణంలో అనేశాడు వెంకడు!ఇంతలో గుహ తలుపు తట్టినట్టుగా చప్పుడు రావడంతో..

భేతాళుడు:- "అరేయ్ వెంకా!" గుహ వాకిలి వైపు చూస్తూ పిలిచాడు.

వెంకడు:- "దొరా!" ఏవిటి అన్నట్టు తనూ అటే చూస్తూ అడిగాడు.

భేతాళుడు:- "ఒచ్చినట్టున్నాడు పోయి చూడు! (అని పురమా ఇస్తాడు).

వెంకడు వెళ్లి ద్వారాన్ని తెరవడంతో, నిప్పులు త్రొక్కిన కోతిలాగ రుస రుస లాడుతూ వచ్చాడు విక్రమ వర్మ! భేతాళుడితో తను పలికిన ప్రతాపమంతా ఉత్తర కుమారుడి ప్రగల్భంలాగ చిత్తయి పోయేసరికి-ఏం చెయ్యలో తెలియని వాడిలా,వాళ్లకు ఏమని సర్ది చెప్పాలో అంతు పట్టని వాడిలా, పట్టరాని కోపాన్ని వాళ్లముందు ప్రదర్శించడమే – ప్రస్తుత మార్గంగా ఎంచి భేతాళుడితో...

విక్రమ వర్మ:- " భేతాళా! న్యాయంగా ప్రవర్తిస్తే లాభంలేదు; మహారాజును అడిగాను; అన్న మార్తాండవర్మ ను అడిగాను, ఇద్దరిలో ఏ ఒక్కరు కూడా నాకు అనుకూలంగా మాట్లాడలేదు! అన్న గారికే పట్టము కట్టుటకు పెద్ద లందరు కూడా ఏక గ్రీవంగా ఆమోదించారు.

పైగా అది ఒక ఆచారంగాను, రాజ్యాధి కారంపైన అన్నగారికి మాత్రమే హక్కు కలిగి నట్లుగాను, నన్ను ఏ ఒక్కరు లెఖలో కూడా పెట్టుకోకుండగా మాట్లాడారు!"

అంటూ తాను పొందిన పరాభవం-వారికి తనపైన జాలితో పాటు,వాళ్లపైన పౌరుషం కూడా కలగాలని,అన్నగారికి తగిన బుద్ధి చెప్పే విధంగా వాళ్లు కూడా తనకు సహకరించాలని;తాను ఏ మాత్రం కూడా చులకన కాకూడదని,ఆ విధంగా తన ఆ క్రోశాన్ని వెళ్లగ్రక్కాడు; అగ్రహాన్ని ప్రదర్శించాడు విక్రమ వర్మ!

భేతాళుడు:- "నేను ఎప్పుడో అనుకున్నాను! మీ తండ్రి గారు, అన్నగారు ఆలోచించేదంతా కుట్రని, ఈ రాజ్యంలో మీకే మాత్రం కూడా స్థాన మివ్వరని; అమాయకంగా నాతండ్రి, నా అన్న అంటూ మీరు కలుపు కొనే భాంధవ్యమంతా ఎడారిలో బాటసారుల చంద మవుతుందని! నేను చెపితే మీరు విన్నారా! అయినా ఇప్పటికీ మించి పోయిందేమీ లేదు! మనకు కావలసింది రాజ్యమేగా?"

అడిగాడు విక్రమ వర్మను. ఎందుకంటే...'రాజ్యం' కావాలనే ధృఢ సంకల్పమే గనుక మనసులో ఉండి వుంటే, కొన్ని అను బంధాలకు దూరం కావలసి ఉంటుంది! అలాంటి సెంటి మెంట్లకే నేను విలువ నిస్తాను అనుకొంటే, కాలి కింద చెప్పు లాగ-వాకిలి ముందు పడుండాలే గాని, చేతిలో కర్రలాగ ఇంట్లో చరించ కూడదు! మరింకేదో కావాలని పదే పదే పరితపించ కూడదు!

విక్రమ వర్మ:- "అంతే! నాకు రాజ్యమే కావాలి!"

స్థిర చిత్తంతోనే అన్నాడు విక్రమ వర్మ అదే తనకు జీవితాశయం అయినట్టు; అది తప్ప తనకు మరో అజెండా గాని,ఇతరత్రా పేకేజీలు గాని పని లేదన్నట్టు!

భేతాళుడు:- "రాజ్యము కావలసి ఉంటే...నీ సోదరుడు మార్తాండవర్మ మరణించాలి! నీ కన్న తండ్రిని చెరసాలలో పెట్టాలి! తదుపరి మన ఆశయం నెర వేర్చుకోవాలి; కర్తవ్యం సాదించాలి!"

తారక మంత్రాన్ని తల తిరిగి పొయ్యేలా బోధించాడు, తార తమ్యాలను కాల రాశేలా కవ్వించాడు భేతాళుడు! తానెక్కు తున్నది ముళ్ల చెట్టయినపుడు, ఏ ఒక్కటి

కూడా గుచ్చుకో కుండగ, పైపైకి ఎక్క గలనని ఏ అవివేకి కూడా అనుకో లేదు గదా! అయినా...అలా ఎందుకు చెయ్యాలంటూ అమాయకంగా అడిగాడు విక్రమ వర్మ!

విక్రమ వర్మ:- "అన్నను చంపడం దేనికి! మనకు కావలసింది రాజ్యమేగా? మన అర్ధరాజ్యము మనకు వచ్చేలా మనం పోరాడి సంపాయించుకొందాం!"

'అను బంధం' అనేది కొంత అడ్డురాగా, కలిసి పెరిగిన ఆత్మీయత కూడా విక్రమ వర్మ నోటి నుంచి, అనుకోకుండగ అలా అనిపించేసింది! అదే రక్త సంభందానికున్న మహత్తర మర్మం; విచిత్ర ధర్మమూను!

భేతాళుడు:- "అన్న బ్రతకాలి, రాజ్యము రావాలి దొరా! అనవసరమైన ఆలోచన తో మనసు పాడు చేసుకోకు. ఇద్దరి సోదరుల మధ్య భాగం చీల వలయునూ అంటే...ఇద్దరిలో ఎవ్వరైనను ఒకరు మరణించ వలసిందే!"

అంతకు మించి మరో మార్గం లేదన్నట్టు ఖరా కండిగా చెప్పేశాడు భేతాళుడు! విక్రమవర్మ రావడం తోనే మధువు సేవనలో మునిగిన కారణంగా, మత్తు తల కెక్కుతున్న దశలో ఎటూ తేల్చుకోలేక, మరేమి ఆలోచించ గలిగే స్థితిలో కూడాలేక...

విక్రమవర్మ:- "అయితే ఇంతకీ నీవనేదేవిటి?"

అంటూ మాట నంగిగా పలుకుతూ, కళ్లు తిరుగుతూన్న దశలో తూలి పడబోతూండగా, వెంకడు వచ్చి సాయంగా పట్టుకొని కూర్చుండ బెట్టాడు!

భేతాళుడు:- "రాజ్యము మన వశ మవ్వాలి. మహా రాజును బంధించాలి!"

అని భేతాళుడు అంటూ ఉండగనే, ఎవరో ద్వారం వద్ద శబ్దం చేసి నట్టుగా తోచి, వెంకడు వెళ్లి తలుపు తెరువగా, ఎవరో ఒక 'స్త్రీ' అతి సాధారణ అలంకరణతో, ఆదరణకై వచ్చిన దానిలా అతి దీనంగా కనిపిస్తూ, వెంకడిని ఏదైనా పనుంటే చెప్పి చేర్పించ మన్నట్టు ప్రాధేయ పడుతున్నటుగా అడిగింది! చూడటానికి సుందరిలా ఉంది గాని...పని మనిషినంటూ ప్రాధేయ పడుతోంది. సరే అడిగొస్తానని లోపలికొచ్చి...

వెంకడు:- "దొరా! ఎవరో సింగి ఇక్కడ పని సేత్తుందంట పిలవ మంటారా?"

అని అడిగి అనుమానంగా విక్రమ వర్మ వెంక చూడ సాగాడు! ఈ బాబు కంటికి అందమైన ఆడది కనిపిస్తే అంతే సంగతులు అని అనుకొంటూ...

భేతాళుడు:- "పోయి తీసుకురా!"

వెంకడు వెళ్లి ఆ 'స్త్రీ'ని వెంట బెట్టు కొని వాళ్లున్న చోటుకి తీసుకొస్తాడు. అంత మైకంలో ఉండి కూడా, ఆ 'స్త్రీ' ని చూడ్డంతోనే విక్రమ వర్మలో, వికారపు చూపులు షికారుగా బయట కొచ్చాయి!

విక్రమవర్మ:- "ఎవరు నువ్వు! ఎందు కొచ్చా విక్కడికి?"

ముందుగా తనే పలకరించాడు విక్రమ వర్మ! సమాధానం ఎలా ఉంటుందో వినాలని.

మల్లమ్మ:- "నన్ను మల్లమ్మ అంటారు లెండి!"

అతగాడి వికారపు చూపులు-తనను ఎక్కడ నమిలేస్తాయోననే భయంతో, క్లుప్తంగా సమాధాన మిచ్చింది మల్లమ్మ.

భేతాళుడు:- "మల్లమ్మా! ఇంక్కడికెందుకొచ్చావు? మా దగ్గర పని దొరికిద్దని ఎవరు చెప్పారు నీకు?"

భేతాళుడు అసలే అనుమానస్తుడు! ఎవర్ని కూడా అంత తేలిగ్గా నమ్మడు. ఆకారణంగానే ఇన్ని వివరాలతో ఆరా తీశాడు, అనుమానంగా అడిగి చూశాడు.

మల్లమ్మ:- "నా అనే దిక్కు లేరు దొరా! వీధు లెంబడే ఆడుకొంటూ బతుకుతున్నా...! మీ తావున ఏదైనా పనుంటే చేసుకొని బతకాలనొచ్చా దొరా! యీదులెంట తిరుగుతా ఉంటే... అడ్డవైనోళ్లంతా ఆకలి గొన్నట్టు నన్ను సూత్తా ఉండారు దొరా! అయి తట్టుకోలేక ఇక్కడి కొచ్చా. మీదయ దొరా!"

అని తన పరువపు అందాలు బహిరంగంగా బజారులో ఉంటే, తనకెంత కష్టంగా ఉందో... ఏకరువు పెడుతూ, తాను ఒక రకంగా అందగత్తె నేనని వాళ్లకు చెప్పకనే చెపుతూ, వోర కంటితో విక్రమ వర్మనే చూస్తూ, తనను ఒదులుకో కూడదనే ఆశ అతగాడిలో కలిగిస్తూ, నేల చూపులు చూస్తూ నిలుచుండి పోయింది మల్లమ్మ!

విక్రమవర్మ:- "భేతాళా! ఏవిటి నీ నిర్ణయం?"

తనకు ఉండమని చెప్పాలని ఆత్రంగా ఉన్నా... తనే ముందుగా చెపితే, వాళ్లు వేరే విధంగా అనుమానిస్తారని తెలుసు కాబట్టి-ఆ మాట వాళ్లతోనే చెప్పించాలని భేతాళుడి సలహా అడిగాడు విక్రమ వర్మ! ఆ మాత్రం తెలియనంత అమాయకుడేంకాదు భేతాళుడు! అయినా విక్రమ వర్మను ఏదో విధమైన మత్తులో ముంచి, రాజ్యంపై దండెత్తేలా చేసి, రాజ భోగాలు అనుభవించాలనే దురాశలోనున్న భేతాళుడు...

భేతాళుడు:- "సరే ఇక్కడే ఉండు! కాని...మాకు నీపైన ఏ మాత్రం అనుమానం ఒచ్చినా, మీ వాళ్లు ఏరుకోడానికి-బొయికలు కూడా దొరకవు సరేనా?"

అని బెదిరించి చూశాడు! ఒక వేళ దురుద్దేశంతో చేరేదే గనుక అయి ఉంటే... భయపడి పారిపోతుందనే చిన్న పరీక్షతో, ఆ విధంగా బెదిరించి చూశాడు!

మల్లమ్మ:- "అదేంది దొరా! నేనట్టాంటి దాన్ని కాదు దొరా! మీరెట్టా సెపితే అట్టాసేత్తా, మీరే సూత్తారుగా ముందు ముందు నేనెట్టాంది దాన్నో!"

అని చాల అమాయకంగాను, మోసమంటే ఎలాగుంటుందో తనకు తెలియదన్న విధంగాను మాట్లాడ సాగింది మల్లమ్మ. దాంతో వాళ్లకు ఆమెపైన పూర్తిగా నమ్మకం కలిగింది.

భేతాళుడు:- "అరేయ్ వెంకా!"

వెంకడు:- "దొరా...?"

భేతాళుడుః- "దీని కళ్లకు గంతలు కట్టి-పాతాళగుహ ఆవలకు తీసుకుపోయి పనిచూపించు."

వెంకడుః- "అట్టాగే దొరా!"

అని మల్లమ్మను వెంట బెట్టుకొని వెంకడు వెళుతూండగా, మధువు సేవిస్తూ ఉన్న విక్రమ వర్మ-వెళ్లే మల్లమ్మవైపే దృష్టి పెట్టి అలాగే చూస్తూ ఉండిపోతాడు. భేతాళుడు కూడా ఏదో పని ఉన్న వాడిలా ప్రక్క వాకిలి గుండా తనూ వెళ్లి పోతాడు.

(2 వ రంగం సమాప్తం)

## (3వ రంగం)

అది ఒక పూజా మందిరము. ఆ మందిరంలో మహారాజు గారైన విజయేంద్ర వర్మ శోక తప్త హృదయంతో, ఆ కనిపించని భగవంతుడి ముందు చేతులు జోడించి, తన కోరిక తీరక పోవడాన్ని తీవ్రమైన విషయంగా భావించి, అంతులేని మనోవేదనతో ఆయన ముందు మొరపెట్టుకోసాగాడు.

మహారాజు:- "పరమేశ్వర! నాకీ పరీక్ష ఎందుకు కల్పించావు తండ్రీ? తర తరాల నుండి వచ్చు చున్న ధర్మాచారాలను నాశనం చేసే పుత్రుణ్ణి ఎందుకు ప్రసాదించావు తండ్రీ ఎందుకు ప్రసాదించావు? ఆపద్బాంధవ... అనాధ రక్షక శరణు...శరణుయని వాపోవు ప్రజల పాలిట, ఇటు వంటి క్రూర మృగాలను ఎందుకు ఉసి గొలిపావు తండ్రీ ఎందుకు ఉసిగొల్పావు? దుర్మార్గుల చెప్పుడు మాటలకు తలవొగ్గి... ఎటువంటి నీచ కార్యాలకు పాల్పడతాడో గదా! ఈ ప్రళయాన్ని ఆపలేవా? ధర్మ సామ్రాజ్యమన్న పేరు నిలుపలేవా?"

అని అనేక విధాలుగా ఆ పరమేశ్వరుణ్ణి ప్రార్థించ సాగాడు. ప్రాధేయ పడటం కూడా చేశాడు మహారాజు విజయేంద్ర వర్మ! ఎంతగానో బాధ పడుతూ తను ప్రాధేయపడ్డా, మరెంతగానో ఆవేదన చెందుతూ తను ఆవేశపడ్డా, జరగ వలసిన దాన్ని-జరక్కుండగా చేయడం ఆయనకు మాత్రం ఎంతవరకు సాధ్యపడుతుంది? అదీ గాకుండగా పూర్వ జన్మ సుకృతంగా మనం అనుభవించవలసిన ఖర్మలను, అనుభవించకుండగా తప్పించుకో వాలని చూడడం ఎంత వరకు భావ్యమవుతుంది. మరెంత వరకు ధర్మమవుతుంది. అంతలో మార్తాండ వర్మ పూజా మందిరం లోనికి వచ్చి తండ్రి గారితో...

మర్తాండవర్మ:- "నాన్నగారూ! తమ్ముడి గురించి విచారించకండి! వాడు ఎచ్చట ఉన్నా...ఎవరి ప్రలోభాలలో చిక్కుకొని ఉన్నా, వెతకి తెచ్చి మీ కప్పగించే బాధ్యత నాది! మీరు విచారించకండి!

అంటూ తండ్రిని వోదార్చే ప్రయత్నం చేశాడు మార్తాండ వర్మ. పాపం! తండ్రిగారు ఎంతగానో ఆశపడ్డాడు; తనకు రాజ్య భారాన్ని అప్పగిస్తే అన్నదమ్ము లిరువురం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండగా రాజ్య పాలన గావిస్తామని, తాను కొంత కాలం తీర్థ యాత్రలు చెయ్యాలని, ఆ పిదప మాకు వివాహ బంధాలతో అక్షింతలు వెయ్యాలని

ఎంతగానో తాపత్రయ పడ్డాడు. తపన చెందాడు కూడా!

మహారాజు:- "నాయనా మార్తాండ వర్మా! రాజ్య భారాన్ని మీ కప్పగించి, నేను సుఖంగా విశ్రాంతి తీసుకుందమని ఎంతగానో ఆశ పడ్డాను. అన్నదమ్ము లిరువురు రాజ్య భారాన్ని వహించి ధర్మంగా రాజ్యాన్ని పరిపాలిస్తారని, వినయ మూర్తులుగా పేరు ఘడిస్తారని యెన్నో కలలు గన్నాను. ఎంతగానో ఈ దేవుళ్లకు మొక్కుకున్నాను. కాని... నేటి వరకు నా ఆశలు ఫలించలేదు నాయనా...ఫలించ లేదు!"

ఎంతో నిరాశ చెందిన వాడిలా నీరసించిన గొంతుకతో నిర్వేదంగాను, నిరుత్సాహ పూరితంగాను మాట్లాడటం మార్తాండ వర్మను కలచి వేసింది! ఎప్పుడూ ఎంతో శాంత గాంభీరంగా ప్రతి విషయాన్ని అతి తేలిగ్గా తీసుకొని, ఎంతో సునాయాసంగా పరిష్కరించ గలిగే నాన్నగారిలో, తమ్ముడి విషయంగా ఇంతటి మానశిక సంఘర్షణకు గురి కావడం, నిజంగానే మార్తాండ వర్మకు బాధ కలిగించింది, వేదన రగిలించింది!

మార్తాండవర్మ:- "నాన్నగారూ! తమ్ముడి విషయంలో మీరెలాంటి బెంగా పెట్టుకోకండి ఆ కోయ మూకతో చేతులుకలిపి, వాడు మనహోదాను, మన గౌరవాన్ని పాటించకుండా సంచరిస్తున్నాడు! అలాంటి వాణ్ణి ఎలా దారికి తీసుకు రావాలో నాకు తెలుసు. ఆ విషయంలో మీ కెలాంటి సంకోచము అక్కరలేదు. వాణ్ణి సరైన దారిలో నేను తీసుకు వచ్చి మికు అప్పగిస్తాను."

తండ్రికి ఊరట కలిగించాడు మార్తాండ వర్మ. అందుకనే పెద్దవాడికి పట్టం కాట్టాలనుకొనేది-కట్టేది కూడా! ఎందుకో తెలియదు ఆ భగవంతుడి 'సృష్టి' నిర్మాణంలో కూడా, ఇంటికి పెద్ద కొడుకుగా పుట్టన వాడిలో ఎంతో వోర్పును కలిగిస్తాడు; అంతకు మించిన నేర్పునూ పెంపొందిస్తాడు!

మహారాజు:- "నాయనా! కోయ వాళ్లంటే సామాన్యులు కారు. వాళ్లు అనేక రకాల కుయుక్తులలో ఆరి తేరిన వాళ్లు! అలాంటి వాళ్ల బారి నుండి మనవాణ్ణి ఎలా బయటకు తెస్తావో, నచ్చచెప్పివాణ్ణి ఎలా దారికి తెస్తావో, వాళ్లతో కాస్త జాగ్రత్తగా వ్యవహరించు నాయనా!"

వాళ్ల మొరటు తనం దురుసు స్వభావం-ఎంతో కొంత అవగాహన కలిగిన వాడు-ఆ నోటా ఈ నోటా విని ఉన్నవాడు గనుక, మహారాజు ముందు జాగ్రత్తగా హెచ్చరిక జారీ చేశాదు!

మార్తాండవర్మ:- "భయ పడకండి నాన్నగారు! విజయుణ్ణి కూడా వెంట తీసుకొని వెళుతున్నాను. మీరెళ్ళి విశ్రాంతి తీసుకోండి!"

తండ్రికి ధైర్యం కలిగించడం కోసం, తన మిత్రుడైన విజయుణ్ణి కూడా వెంట తీసుకొని వెళుతున్నట్టు చెప్పాడు. దానితో మహారాజు విజయేంద్ర వర్మ...

మహారాజు:- "అంతకు మించి నేను చేయ గలిగింది మాత్రం ఏముంది నాయనా? కాని...ఒక్కటి మాత్రం అక్కడ జాగ్రత్తగా ఆలోచించి మరీ ప్రవర్తించు! నీవు వెళ్లే ప్రదేశమంతా అనేక మాయా జాలాలతో కూడినది. అక్కడి వాళ్లు మనుషులు కారు. తోటి మానవుడి రక్తాన్ని పీల్చి పిప్పి చేసే నరరూప రాక్షసులు! ఇంత కంటే నీకు వివరించి చెప్ప వలసిందేమియూ లేదు!"

అంటూ వాళ్ల గురించి తనకు తెలిసి నంతలో వాళ్ల స్వభావాలను, స్వలాభాలను ఏకరువు పెట్టాడు మహారాజు.

మార్తాండవర్మ:- "న్యాయ మనేది మన ప్రక్కన ఉంటే...ఎటువంటి మాయలు, మంత్రాలు మనల్ని బంధించలేవు నాన్నగారు! మీరీ ఆలోచన మాని విశ్రాంతి తీసుకోండి."

మహారాజు లోనికి వెళ్లను. తన మిత్రుడైన విజయుడు కోటంతా గాలించి మార్తాండ వర్మ ఎక్కడా కనిపించక పోయేసరికి ఆఖరి ప్రయత్నంగా, మహారాజు గారి వద్ద ఉండి వుండ వచ్చనే అభిప్రాయంతో ఇక్కడికి వచ్చి మార్తాండ వర్మను కలుసుకోవడం జరుగుతుంది.

మార్తాండవర్మ:- "విజయా రా రా...! నీ కొరకే కబురు పంపాలను కొంటున్నాను. అంతలోనే నువు రానే వచ్చావు!" (అని చెయ్యి పట్టుకొని వెళ్ల బోవును. కాని.. విజయుడు కదలడు)

విజయా! ఏవిటి కదలవు...! ఎందుకు అలా విచారంగా ఉన్నావు? ఏం జరిగింది?"

అంటూ సందేహ పూర్వకంగానే సమాధానం అడిగాడు. మార్తాండ వర్మకు విజయుడితో ఇది మామూలే! ప్రతి చిన్న విషయానికి ఎంతగానో రాద్ధాంతం చేసే అలవాటు విజయుడిది! అందుకే యదాలాపంగానే అడుగుతూ అందులో కొంత సందేహాన్ని కూడా జోడించి మరీ అడిగి చూశాడు మార్తాండ వర్మ.

విజయుడు:- "అనిపించిందీ...! నా మొహం చూసి నీకూ అలాగే అనిపించింది? సరీఘా సరళ కూడా ఇదే మాటంది! ఆ విచారమంతా నాకేగాని, నీకేమాత్రమైనా ఉన్నదాని...?

అంటూ ఎక్కడలేని బాధను తనే పడుతున్న వాడిలా పోజుపెట్టి, మిత్రుణ్ణి చూడటం కూడా ఇష్టం లేని వాడిలా ప్రక్కకు తిరిగి నిలబడ్డాడు విజయుడు.

మార్తాండవర్మ:- "అదేవిటి విజయా...! నేను విచారంగా ఉండాలా! ఇప్పుడంత మునిగిపోయిందే మున్నదని?

అతగాడి అలకను, నిష్టురాన్ని ధ్వనించే స్వరాన్ని వింటూ-ఏమి జరిగుంటుందా... అని ఆలోచనలో పడ్డాడు మార్తాండ వర్మ.

విజయుడు:- "అవునులే! సాధువులు సన్యాసమంటే విచారించరు, యోధులు అవరోధాలంటే విచారించరు. ఎటు తిరిగి నా వంటి అసమర్థులకే ఏ విచారమయినా!"

అంటూ విజయుడు ఒకే విషయాన్ని అదే పనిగా సాగదీస్తూ, అసలు ఏం జరిగిందో చెప్పక పోవడంతో మార్తాండవర్మకు చిరాకేసింది. తను ఇలాగే వింటూ ఊరుకుంటే-తను అలాగే దెప్పి పొడుస్తూ పోవడం ఖాయం. అనుకొని...

మార్తాండవర్మ:- "ఏమిటయ్యా నీగొడవ! ఇప్పుడు నిన్ను అసమర్థుడని ఎవరన్నారు? అసలు విషయం చెప్పకుండా ఆర్భాటం చేస్తా వెందుకు?"

మెత్తగా అడిగితే దారికి రాడనుకొని కాస్త కరువుగానే, అతగాడి మర్యాద చెడని రీతిలో అంటూ, ముందుకు కదల బోయాడు మార్తాండవర్మ. మిత్రుడికి కోపం వచ్చి నట్టుగా గ్రహించిన విజయుడు ఇక ఈ విషయాన్ని సాగదీస్తూ పోవడం మంచిది కాదనుకొని, ఠక్కున మార్తాండ వర్మ చెయ్యి పట్టుకొని ఆపుతూ.

విజయుడు:- "యువరాజా! నా సలహాలు నీకు సరిగా వంట పట్టవుగాని... ఎన్ని సార్లు చెప్పాను నీకు! విక్రమ వర్మ మీ మాటను లెఖ చెయ్యరయ్యా అని...విన్నారా? వారి బుద్ధి ఏనాడో వక్ర మార్గాన్ని తొక్కిందయ్యా అని లెఖ లేనన్ని సార్లు-ఒకసారా, రెండుసార్లా వందల సార్లు చెప్పాను. నా మాట వింటేగదా!"

అని తెగేసి నట్టుగా అడిగేశాడు విజయుడు. అసలు అతగాడు ఇంతగా మీ తండ్రి గారికి, మీకు, ఎదురు తిరిగి మాట్లాడేటంత దూరం రానిచ్చింది నువ్వే నన్నట్టుగాను, ఎప్పుడో గనుక మీరు కట్టడి చేసి ఉంటే-ఇప్పుడు ఇలాంటి పరిస్థితి దాపురించి ఉండేది కాదు అన్నట్టుగాను!

మార్తాండవర్మ:- "వాడు ఇంతగా మారిపోతాడని నేనెప్పుడూ ఊహించి ఉండలేదు విజయా! ఏదో చిన్న తనంగదా... అలా సరదాగా తిరిగు తున్నాడులే అనుకున్నాను గాని, ఇంతలా పథకాన్ని తయారు చేసుకొని, మా మీదనే కాలు దువ్వేంతగా కుట్ర పన్నుతాడని కలలో కూడా అనుకోలేదు!"

అనుకోనివి జరగడమే కదా-జీవితమంటే! మనం అనుకున్న వన్నీ అనుకున్నట్టుగా జరుగుతూ పోతుంటే, ఇంకా భగవంతుడనేవాడు ఒకడున్నాడని... అన్నీ అతగాని ఇష్ట ప్రకారమే జరుగుతూ పోతూంటాయని, మన ఇష్ట ప్రకారం ఏవీ జరగవని ఎందుకు అనుకుంటాం...ఎలా భావిస్తాం?

విజయుడు:- "ఎవరు మాత్రం ఊహించి చెప్ప గలరయ్యా! నేను మాత్రం ఊహించి చెప్పానా...నలుగురూ నానా రకాలుగా అనుకొంటూ ఉంటే-ఉండ బట్టలేక మిత్రుడివి గదాని నీతో చెప్పాను అంతే!"

అతిగా మాట్లాడి మిత్రుడికి కోపం తెప్పించకుండా, అసలు విషయాని కొచ్చాడు విజయుడు. నలుగురూ అనుకొనే విషయాన్ని నలిపి నలిపి సాగదియ్యకుండా, కుదించి మరీ క్లుప్తంగా అనేశాడు. ఎంతైనా బ్రాహ్మణ వంశీయుడు గనుక-లౌక్యం అనేది వారికి వెన్నతో పెట్టి నేర్పించిన విద్య కదా!

మార్తాండవర్మ:- "ఇదంతా ఆ కోయవాడి పన్నాగమే! లేక పోతే మనవాడు ఈ విధంగా ప్రవర్తించడు. మా ఇద్దరినే కాకుండగా, మహామంత్రిని

సైతం ఇంతగా వ్యతిరేకించదు!"

అంతటి సభలో మహామంత్రిని కూడా లెఖ లేని విధంగాను, లెఖ చేయని విధంగాను మాట్లాడటం మార్తాండ వర్మకు బాధ కలిగించింది! ఆయన ఎంతో కాలంగా ఈ రాజ్యానికి ఎంతగానో సేవలందించిన వ్యక్తి. పైగా వయసులో చాలా పెద్దవాడు కూడా! అలాంటి ఏ ఒక్క అర్హతకూ విలువ నివ్వకుండగా విక్రమ వర్మ మాట్లాడటం అందరికీ మన స్థాపం కలిగించింది!

విజయుడు:- "అదే పొరపాటు! వాడెవడివో చెప్పుడు మాటలు విని మనవాడు చెడి పోయాడనేది శుద్ధ అబద్ధం. మరి నేను చెడిపోలేదే? ప్రాణేశ్వర-ప్రాణప్రియ-విజయా! నీ అందానికి నేను బందీనై పోయాను. నా డెందాన్ని నీవు గ్రహించలేదా? ఈ అందాన్ని నీ కొరకే భద్రపరిచాను. అని ఎన్నో మాయో పాయాలతో నన్ను వరించాలని ప్రయత్నించిన సరళకు నేనంత తెలిగ్గా బోల్తా పడ్డానా? ఛ...ఛ...దూరంగా ఉండు. అది ప్రస్తుతానికి జరిగేది కాదు. మా యువరాజు ఒక అమ్మాయిని ప్రేమించాలి అప్పుడు నిన్ను నేను ప్రేమించాలి. మా యువరాజు ఆ అమ్మాయిని పెండ్లి చేసుకోవాలి; అప్పుడు నేను నిన్ను పెండ్లి చేసుకోవాలని పట్టుదలతో గట్టిగా చెప్పేశాను!"

చిన్నప్పటి నుండి స్నేహితులైన వాళ్లలో పెరిగిన ఆత్మీయత ఏపాటిదో, ఆ స్నేహం ఏ స్థాయిలో ఉంటుందో వీళ్లిద్దరి మధ్యన సాగే సంభాషణల సారూప్యతను గమనిస్తే మనకు ఇట్టే అర్థమవుతుంది. మార్తాండవర్మ వంశ పారం పర్యంగా వస్తున్న విజయ నగర సామ్రాజ్యానికి కాబోయ యువరాజు-మహారాజు కూడ. విజయుడేమో ఒక సామాన్య బ్రాహ్మణ కులంలో పుట్టిన పేద బాపడు! అలాంటి వీరి మధ్యన ఎలాంటి పేద గొప్ప అనే భావం ఏనాడూ, ఏ ఒక్కరిలోనూ కనిపించేది కాదు, అనిపించేది కాదు, ఎవరి నోటి వెంటా వినిపించేది కూడా కాదు!

మార్తాండవర్మ:- "నీ కబుర్లకేంగాని...ఎలాగైనా వాణ్ణి దారికి తీసుకురావాలి విజయా! నాన్నగారికి వాణ్ణి గురించి చాలా విచారంగా వున్నది. సరే... నువ్వొక పనిచేస్తావా? ఎలాగైనా సరే నువ్వు మారు వేషంలో వెళ్లి వాళ్లలో కలవాలి. అక్కడ జరిగే విషయాలన్ని ఎప్పటి కప్పుడు

నాకు తెలియ జేస్తూ ఉండాలి!"

ఇక వాళ్లను ఉపేక్షించడంగాని, వాళ్ల విషయంలో ఆలస్యం చేయడం గాని అంత మంచిది కాదని భావించాడు మార్తాండవర్మ. ఆ ఉద్దేశంతోనే ముందుగా విజయుణ్ణి వాళ్ల స్థావరానికి పంపి, వాళ్ల గుట్టు మట్లు కొంత కూపీ లాగ గలిగితే, ఆ తరువాత జరగ వలసిన కార్యాన్ని తాను పథకం ప్రకారం నడప వచ్చని భావించాడు. ఆ మాటతో విజయుడు...

విజయుడు:- "నేనా...! ఒంటరిగానా..! అదీ మారు వేషంలో వెళ్ళి వాళ్లలో కలవాలి! తిరిగి రాకుండగా వడ్డిస్తే?"

స్వతహాగ కొంత భయస్తుడు విజయుడు. అదీ గాకుండగా ఆ కోయవాళ్లు అసలే పరమ మూర్ఖులు! అలాంటి వాళ్ల మధ్యలోకెళ్లి మారు వేషంలో తాను కలిస్తే, ఖర్మకాలి నా అసలు రంగు విక్రమ వర్మ కనిపెట్టి వాళ్లకు గనక చెపితే, ఇంకేముంది, నాకు ఎముకల్లో సున్నంకూడా మిగల కుండగా చేస్తారు వాళ్లు!

మార్తాండవర్మ:- "నీకేం ఫర్వాలేదులే వెళ్లి రావయ్యా! ముందు నువ్వు అక్కడికి వెళ్లు. ఆ తరువాత విషయ మంతా నేను చేసుకుంటాను గదా! నీకెలాంటి ప్రమాదము రానివ్వను - సరేనా?

నచ్చచెప్పే ధోరణిలోనె-ఆ పైన నేను చూసుకుంటానంటూ మిత్రుడికి కొంత ధైర్యాన్ని కలిగించే ప్రయత్నం చేశాడు మార్తాండవర్మ. వాస్తవంగా చెప్పలంటే కోయవాళ్లు పెద్ద మూర్ఖులు. వాళ్లలో ఆలోచనా శక్తి చాలా తక్కువ. ఆవేశం పాళ్లు మాత్రం అతి ఎక్కువగా వాళ్లలో మనకు గోచరిస్తూ ఉంటాయి!

విజయుడు:- "ఆс..! నన్ను వాళ్లలోకి పంపి నువ్వు సుఖంగా ఇక్కడ ఉండు. అక్కడికెళ్లి అవస్త పడేది నేనేగా!"

మార్తాండ వర్మ చెపితే నిప్పుల్లో దూకమన్నా దూకడానికి వెనుకాడడు విజయుడు. కాకపోతే ముందుగా మాత్రం ప్రతిసారి, ప్రతి దానికి ఈ విధంగా మిత్రుడితో కొంత సేపు వాగ్వాదానికి దిగి-ముచ్చట్లాడు కుంటేగాని, విజయుడికి తృప్తిగా అనిపించదు, విషయాసక్తి కనిపించదు!

మార్తాండవర్మ:- "అదికాదు విజయా!"

అంటూ మరింకేదో చెప్పాలని చూశాడు మార్తాండ వర్మ. కాని అతని మాట దూరనివ్వకుండగా అసహనాన్ని ప్రదర్శిస్తూ...

విజయుడు:- ఏదికాదూ? (అంటూ చిరు కోపాన్ని కలిగి, చిటపట లాడ సాగాడు.)

మార్తాండవర్మ:- "అబ్బా! నేను చెప్పేది వినవయ్యా! నేను ముసుగు మనిషి వేషంలో అక్కడి కొస్తాను. అప్పటి వరకు నువ్వు అక్కడ ఉండి-వాళ్ల విషయాలు తెలుసుకొంటూ ఉండు!"

అని చెప్పి... ముందుగా తనను అక్కడకు ఎందుకు వెళ్లమన్నాడో ఆ రహస్యాన్ని కాస్తా వెళ్ల గక్కేశాడు మార్తాండ వర్మ. అలా గనక విజయుడుతో తను చెప్పక పోయుంటే, అసలు వాళ్ల దాక కూడా తను వెళతాడో లేదో ననే భయంతో ముందుగానే చెప్పేశాడు.

విజయుడు:- "సరే! (మార్తాండ వర్మ వెళ్లిపోవును) స్నేహితుడు కావడం, అందులోను యువరాజు కావడం-ప్రాణాపాయ కరమైన కార్యము నా తలపై పెట్టడం! తప్పేదేముంది. దొర తలచుకొంటే దెబ్బలకు కొదవా?" అంటూ నిష్క్రమించును.

(3వ రంగం సమాప్తం)

## (4వ రంగం)

విక్రమ వర్మకు కొండ గుహలో అన్ని సౌకర్యాల అమరికతో, చక్కని వసతినే ఏర్పాటు గావించాడు కోయదొర! ఎంతైనా రాజకుమారుడు గదా! అందులోనూ వాళ్లకు రాజభోగాలపై మోజు కలిగి, ఇతనిలో 'రాజ్యకాంక్ష'ను రేపిన వాళ్లయిరి! ఆమాత్రమైనా చెయ్యకపోతే వాళ్ల గుప్పిటలో నుండి ఎక్కడ జారిపోతాడో ననే భయం ఉంటుంది గదా! రంభలాంటి కోయకన్నెను ఎరగా చూపిన వాళ్లు ఈ మాత్రం చెయ్యరా!

ఆ కోయ కన్నెపైన కూడా విక్రమ వర్మకు మోహం మొత్తినట్టుంది! అందుకు నిదర్శనమే నేమో మధువుపైన ఇంతలా అధిక ప్రీతిని కనబర్చడం! కాయల క్కాయలు కాసింత మిగల్చకుండగా ఖాళీ చేసేయటం. మగువపైన మోజు అధికంగా గలవాడు-మధువుపైన ప్రీతిని అధికంగా కనబర్చుడు. మోతాదులో మాత్రమే

సేవించగలడు, మైమరచి కాంతతో క్రీడించ గలడు! అలా కాకుండా కళ్లు మూతలు పడేంతగా తాగిన విక్రమ వర్మ....

విక్రమవర్మ:- "అరేయ్ వెంకా!"

తూలుతూనే పిలిచాడు విక్రమ వర్మ. ఏదో పని చేసుకుంటూ దూరంగా ఉన్న వెంకడు పరుగులాంటి నడకతో విక్రమ వర్మ దగ్గర కొచ్చాడు.

వెంకడు:- "బాబయ్యా...! పిలిచారా?"

అంటూ వచ్చి ఎంతో విధేయతగా, చేతులు కట్టుకొని నిలబడి మరీ అడిగాడు వెంకడు.

విక్రమవర్మ:- "ఏదిరా మధుపానం? అయ్యగారికి శిద్ధంగా ఉంచాలని తెలియదురా?"

వెంకడు ముందుగానే అలాంటి ఏర్పాటు చేయడం అలవాటుగా చేసుకొని ఉన్నవాడు గనుక- ఈ రోజు కూడా అది చేసే-తన పనేదో తాను చేసుకో సాగాడు. అలా ఒక వేళ చేయక పోవడమే జరిగితే, అపర రుద్రుడే అవుతాడు విక్రమ వర్మ! అలాంటి అనుభవాలు కొన్ని వెంకడు చవిచూసి ఉన్నవాడు గనుక, ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ ఏర్పాట్లను విస్మరించడు. విరామం చెందడు.

వెంకడు:- "అదేటి బాబయ్యా! కాయదు తెచ్చి పెడితే కాసింత లేకుండా పీలిస్తిరి! ఇంకొద్దు బాబయ్యా! ఇంకా తాగితే మీరు తట్టుకోలేరు బాబయ్యా!

అంటూ పాపం వాడు ప్రాధేయ పడసాగాడు. వాడు పని చేయడానికే వచ్చిన వాడైనా, వయసులో పెద్ద వాడైన కారణం ఒకటైతే, విక్రమ వర్మ ఈ దేశపు యువరాజైన కారణం రెండవది. ఎంతైనా రాచరికపు బిడ్డగదా! ఈ చెడు అలవాట్లతో ఎక్కడ పూర్తిగా చెడి పోతాడోనని, విక్రమ వర్మపై అప్పుడప్పుడు కాస్తంత సానుభూతి కనబరుస్తూ ఉంటాడు వెంకడు.

విక్రమవర్మ:- "అరేయ్! నాకింద బానిసవు నాకే హద్దులు నేర్పుతావట్రా? బుద్ధిలేని వెధవ! పో...పోయితీసుకురా! వెళతావా లెదా?"

అంటూ లేచి వెంకడి మీద మీదికి రాబోయి తూలి పడిపోబోతూ ఉంటే, వెంకడే వెళ్లి పట్టుకొని కూర్చోబెట్టబోతాడు! మళ్లా విదిలించుకొని తూలిక్రింద పడబోతూవుంటే, చూస్తూ ఉండలేని వెంకడు–అతని మాటలుగాని, చేతలుగాని ఏవీ పట్టించుకో కుండగా, మళ్లా తనే వచ్చి విక్రమ వర్మ రెండు రెక్కలు పట్టుకొని పడిపోకుండగా జాగ్రత్తగా తీసుకువెళ్లి కూర్చోబెట్టి...

వెంకడు:– "బాబయ్యా! చేతులెత్తి మొక్కుతా బాబయ్యా! ఈ నాశనపు వాసన మానండి బాబయ్యా!

కూర్చోబెట్టి మళ్లా బోధ చేసే ప్రయత్నం చేశాడు వెంకడు: ఈ వ్యసనానికి బానిస కాకముందు చెపితే, ఇలాంటి మాటలకు విలువ ఉంటుందేమో గాని, కుతికెల్లోతుల్లో దిగిపోయిన వాడికి ఆ మాటలు గాలిలో కలిసిపోయే ధూళిలా అనిపిస్తాయేగాని, సేద దీర్చుటకు పలికే వేద మంత్రంలా అనిపించవు, జ్ఞాన సూత్రంలా కనిపించవు!

విక్రమవర్మ:– "ఊ! చచ్చుపీనుగ ఏదిరా నాశనం? సురాపానం సేవించడం నాశన మట్రా? పిచ్చి పిచ్చిగా వాగేవో డొక్క చీరేస్తా! పట్రా పో–! (వెంకడు బెదురుతూ పోవును) నాశనపు వాసనట–నాశనపు వాసన! వెధవ ఏవాడైనా రుచి చూసి ఉంటేగా, పట్టుగా పది గ్లాసులు బిగిస్తే బెట్టుగా స్వర్గ లోకం చూడొచ్చు. రంభ, మేనక, తిలోత్తమ లందరితో నాట్య మాడించ వచ్చు! ఒక్క పిలుపుతో తలపున మెదిలే వలపుల జవరాలిని రప్పించ వచ్చు. ఇష్ట సుఖాలు తీర్చుకోవచ్చు. అనవసరంగా ఈ బ్రష్టుణ్ణి పిలిచాను. ఛ...ఛ... ఆ– మల్లి, మల్లమ్మ–మల్లమ్మా...!"

ఈ మధ్యనే పనిలో చేరిన 'మల్లి' అనబడే మల్లమ్మ–పనికోసరంగా ఇక్కడికి వచ్చిన రోజునే ఆమె మీద చూపు పడింది విక్రమ వర్మకు! సురాపాన సేవన మత్తులో గమ్మత్తుగా గుర్తుకొచ్చింది మల్లి! ఇంకే ముంది అయ్యగారు అసలే అపిరి తిపిరిగా ఉండటం, అనుకో కుండగా ఆవిడ గుర్తుకు రావడం ఎంతైనా కొత్త రుచి గదా! జిహ్వా చెంచలత్వం చెందకుండా ఎలా వుంటుంది...! చెపలత్వం చెయ్యకుండా ఎలావూరుకుంటుంది? అయ్యగారు పిలిచారు గదా అని విధేయతగా వచ్చి నిలబడి మల్లి...

మల్లమ్మ:- "దొరా! పిలిచారా?"

అతనున్న పరిస్థితి తానురాదగ్గదిగా లేకపోయినా, యజమాని పిలిచాక ఉండీ రాకపోవడం నేరమే అవుతుంది గనుక, పిలిచిన వెంటనే వచ్చి నిలబడి-నాతో ఏమిటి పని? అన్నట్టుగా అడిగింది!

విక్రమవర్మ:- "దొరకాదు...ప్రియా! అనాలి. ఏదీ ఒక్కసారి నీ మృదు మధురమైన పదాల ఉరవడిలో ఒక్కసారి నీ నోటివెంట ప్రియా! అనే పిలుపు వినాలని ఉంది. ఏదీ ఒక్కసారి...అను...ఒక్కసారి..."

అంటూ కైపెక్కిన కళ్లతో-ఆమెను చప్పరించేలా చూస్తూ, దగ్గర దగ్గరగా వస్తూ, ఆమెను పట్టుకోవడానికి ప్రయత్నించే క్రమంలో, మల్లమ్మ దూర దూరంగా జరుగుతూ, అతగాడి చేతికి చిక్కకుండా తప్పించు కొంటూనే...

మల్లమ్మ:- "దొరా! అనాదనని ఆశ్రయం కోరితే, ఆదరిస్తానని అవమాన పరుస్తారా?

ఇంత చీపుగా తన మీదకు కూడా వస్తాడని ఊహించి యుండని మల్లమ్మ ఆశ్చర్యం నుండి తేరుకొనే లోపే, ఆమె పొందుకై, ఆలింగన విందుకై ఆరాటపడ సాగాడు విక్రమ వర్మ!

విక్రమవర్మ:- "అవమానం! అదేమి మాటే అందాల భరిణా! అభిమానం, అంతకు మించిన అవకాశం...అన్నీ ఉన్నాయి గనుకనే-నీ అందచందాలతో నాకు వసందైన విందు చేకూర్చి, అనందాన్ని కల్పించ మంటున్నాను!"

'స్త్రీ' తనం ఎంతటి విచిత్రం! రూప లావణ్యములు పొందికగా గల స్త్రీ ఎంతటి పేదరికంలో ఉన్నదైనా, ఆమె 'స్త్రీ' ధనాన్ని దోచుకోవడానికి ఎందరు-ఎంతగా పరితపిస్తారు! వాళ్లెంతటి పెద్దవాళ్లయినా, మతులు చెడి మరీ మసలుకుంటారు, గతులు దప్పి మరీ ప్రవర్తిస్తుంటారు!

మల్లమ్మ:- "అది అసంభవం! పొట్ట గడవక ఈ వెట్టి చాకిరీ చేయడానికి వచ్చాను గాని... మీ ప్రణయ భోగాలతో విలాసంగా గడపటానికి కాదు; కులాసాగా మీతో కులకటానికీ కాదు! నా అంతస్తుకు

మించిన ఆశలతో ఆత్మవంచన చేసుకొనేటంత అవివేకిని కాను నేను."

ఇదెక్కడిదో పిచ్చి మొద్దు లాంగుంది! అంతటి రాజకుమారుడు నోరు తెరిచి అడిగితే... మరే ఆడది కాదంటుంది? అందులోనూ పని చేసుకు బ్రతికే అతి పేదరికపు స్థితిలో ఉన్నది! అదే ఆశ్చర్యం! ఆమె బ్రతుకు పేదరికం కావచ్చు నేమోగాని, మనసు పేదది కాదు. ఆ మనసు హంగులకు పొంగి పోయేది కాదు, ఆర్భాలాటకు లొంగి పోయేదీ కాదు!

విక్రమవర్మ:- "అధిక ప్రేలాపాలతో అవకాశాన్ని జార విడుచుకోకు. అందాల సుందరివని అర్థించి ప్రేమ భిక్ష కోరుతున్నాను. అది ప్రసాదించి నా హృదయంలో స్థానాన్ని స్వీకరించు రా...రా...!"

అంటూ విక్రమ వర్మ నిషా తలకెక్కు తూండడంతో, ఆమె పైపైకి పోవడానికి పరితపిస్తూ ప్రయత్నించే క్రమంలో, ఇక ఇతగాడికి మెత్తగా చెప్పడం-సత్తు పాత్రను మ్రోగించాలని ఆశపడటం లాంటిదే అవుతుందని గ్రహించిన మల్లమ్మ 'భద్రకాళే' అయింది!

మల్లమ్మ:- "ఆగు! దగ్గర కొచ్చావో ప్రాణాలు దక్కవు జాగ్రత్త! కూటికి లేని దాన్నయినా - నువు తొంగోమంటే తొంగుంటానికి అంత సిగ్గులేని ఆడదాన్ని కాదు నేను!"

అంటూ తనను చేజిక్కించుకోవడానికి వెంటాడుతున్న విక్రమ వర్మను ప్రతి ఘటిస్తూ, ప్రయాస పడుతూ, తనను ఇతగాడి బారినుండి రక్షించే వాళ్లెవరైనా ఉంటారేమోనని- దిక్కులు పిక్కటిల్లేలా అరవ సాగింది మల్లమ్మ.

విక్రమ:- "అహ హ హ! పగ్గాలతో నన్ను బంధించి-సిగ్గు ఎగ్గులతో మ్రగ్గి పోతావేం...! రా రా రా..."

అంటూ వికటాట్ట హాసం చేస్తూ, మదన తాపంతో మదించిన ఆంబోతులా మల్లమ్మను-తన బాహువుల్లో బంధించి, ఆమెకు ఊపి రాదని స్థితిలో ఆమెను ఉక్కిరి భిక్కిరి చేయసాగాడు! ఆగ్రహం అవధులు దాటిన మల్లమ్మ...

మల్లమ్మ:- "వదులు దుర్మార్గుడా! వంటరిగా దొరికిన ఆడదాన్ని చెరపట్టడమేనా

నీ పని? దయా ధర్మ మనేది నీ ఇంట పుట్టలేదా? ధర్మ రక్షణ, ధర్మ ప్రవర్తన సాగుచున్న విజయ నగర సామ్రాజ్యాన్ని చూచయినా సిగ్గు తెచ్చు కోలేవా?"

అంటూ అతగాడి బాహువుల నుండి విడిపించుకొనే ప్రయత్నం చేస్తూనే, ఛీత్కార ధోరణిలో చివాట్లు పెట్టే క్రమంలో.. ఆ రాజ్యపాలనను గుర్తు చేస్తూ, ఆ రాజు సత్ప్రవర్తనను కొని యాడుతూ, నీ ఈ నీచ బుద్ధి మార్చుకో మన్నట్టు మందలించ సాగింది మల్లమ్మ! ఆ మాటతో ఉగ్రుడైన విక్రమ వర్మ తన పట్టు నుండి ఆమెను వదిలి వెనక్కి నెట్టివేస్తూ.

విక్రమవర్మ:- "విజయ నగర సామ్రాజ్యము-ధర్మ ప్రవర్తన..! ఎవరి నోటవిన్నా ఇదే మాట! నీకూ అంత ఆనందంగా ఉన్నదా ఈ దేశతీరు? అయితే ఇప్పుడేపో ఆనందంగా స్వర్గానికి?"

అంటూ ఆమె దగ్గరగా వచ్చి గొంతు పట్టుకొని నులిమి వేసేంత రాక్ష సత్వాన్ని ప్రదర్శించే సమయానికి, అనుకోని విధంగా భేతాళుడు అక్కడికి రావడంతో, విక్రమ వర్మ పట్టునుండి మల్లమ్మను విడిపిస్తాడు. ఆమెను వెళ్ల మన్నట్టు సైగజేసి, విక్రమ వర్మ దగ్గరగా వచ్చి...

భేతాళుడు:- "దొరా! కర్తవ్యాన్ని మరచి-కామ వ్యవహారాలతో కాలాన్ని వృధా చేస్తున్నారు! తల పెట్టిన పని ముడిపెట్ట గలిగితే, వలతో పట్టితేనా నువు కోరిన అందగత్తెలను...!"

అని కర్తవ్యాన్ని గుర్తు చేస్తాడు. ముందు మనం-చేయవలసిన కార్యాన్ని చెవులో జోరీగలా ఊదర గొడతాడు! సురాపాన సుఖము, సుందరి ఆలింగన సౌఖ్యము, రాజ్యము మన భోజ్యమైయిన తరువాత మాత్రమే ననీ-'గీతోపదేశం' లాగ, హితోపదేశం చేస్తాడు విక్రమవర్మకు భేతాళుడు! ఇంతలో విజయుడు ప్రవేశిస్తాడు.

విజయుడు:- "తప్పకోవయ్యా! ఏయ్... తప్పుకోవయ్యా!"

అంటూ విజయుడు తనను పనివాడు గుహ లోపలికి రానివ్వకుండా అడ్డు తగులుతున్నా వినిపించుకోకుండా, వాణ్ణి బుకాయిస్తూ, నెట్టుకుంటూ గుహలో కొచ్చేస్తాడు.

భేతాళుడు:– "ఎవడ్రా వీడు! ఎందుకొచ్చాడిక్కడికి? (అంటూ విజయుణ్ణి చూసి) ఎవరు నువ్వు? మా తావుకొచ్చి మా పనివాణ్ణే నెట్టుకొంటూ వస్తున్నావు! ఎంతధైర్యం! అరేయ్! ఎవడ్రా అక్కడ.... వీణ్ణి లాక్కెళ్లి ఎముకలిరగొట్టండి!"

తమ పనివాణ్ణి కూడా నెట్టుకొంటూ వస్తున్నాడంటే వీడెవడో మాకు శత్రువే అయుంటాడని భేతాళుడు భావించాడు! ఆ ఉద్దేశంతోనే తన అనుచరులనూ పిలిచాడు. పట్టుకొని నాలుగు తగిలిస్తే తిక్క కాస్త దిగి పోతుందని...

విజయుడు:– "అయ్య బాబోయ్! అంతపని చెయ్య బోకండి దొరా! నేనేదో పొట్ట కూటి కోసం వచ్చి నోణ్ణే గాని, మీకు అపకారం చేసేటోణ్ణి కాదు బాబయ్యా!"

అంటూ భేతాళుడికి నసాళం అంటేంతటి నమస్కార భాణంతో మూర్ఛ వచ్చేలా చేశాడు విజయుడు! అతగాడి విధేయుతకు, వినమ్రతకు వసుడైన భేతాళుడు...

భేతాళుడు:– "ఇంతకీ నీవెవరివి? ఇక్కడి కెందు కొచ్చావో చెప్పు?"

అంటూ అప్పటికీ అనుమానం తీరక అతగాణ్ణి గుచ్చిగుచ్చి మరీ చూస్తూనే ప్రశ్నల వర్షం కురిపించ సాగాడు భేతాళుడు.

విజయుడు:– "ఏం శెప్ప మంటారు దొరా! ఓ తల్లి కనేసి సత్తేబాబుల కాళ్లట్టుకొని బతుకు తుండా! పొట్టగడత్తం కట్టమయింది దొరా! కనికరిత్తే

తమ కాళ్లకాడ బతుకు దామని వచ్చా. కనికరించండి దొరా! కాదనబోకండి దొరా!..."

వీళ్లను పట్టించుకో కుండగా, మారువేషంలో వచ్చిన విజయుడి ముఖమైనా చూడకుండా, వెంకడు తెచ్చి పెట్టి పోయిన సురాపాన సేవనలో, అప్పటిదాకా పునీతుడవుతూ గడిపిన విక్రమ వర్మ–అతగాడి మాటలు ఎక్కడో విన్న అనుమానం రావడంతో విజయుడి వైపు చూశాడు. మత్తు బాగా తలకెక్కి ఉన్న వాడవడంతో కళ్లు మసక బారడం–ఎవడో చాకిరి చేసుకొని బ్రతికే వాడి వేష ధారణలో విజయుడు కనిపించడంతో...సరే ఎవడైతే ఏవైందిలే–మంది పెరగడం మంచిదేలే అనుకొని...

విక్రమవర్మ:- "ఓ అలాగ! సరే ఇక్కడే ఉండు. భేతాళా! ఎందుకైనా మంచిది వీణ్ణి కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండమని మనవాళ్లకు చెప్పు. ముందు ముందు ఇలాంటి వాళ్లు కూడా మనకు అవసరం అవుతారు."

అని విక్రమ వర్మ భేతాళుడితో ఒక పనివాణ్ణి పెట్టుకోవడం కూడా, ఏదో సైన్యాన్ని పెంచుకోవడం లాగ భావిస్తూ చెపుతాడు! అతగాడు సేవించే తీర్థం అంతటి ప్రభావం గలది మరి! అది మనిషిని ఎలాగైనా ఆడించ గలుగుతుంది. మరెలాగైనా వేధించ గలుగుతుంది. దానికి సూక్ష్మ గ్రాహ్యత అస్సలుండదు అంతా బాహ్య గ్రాహ్యతే!

ఎవరి స్థావరములకు వారు వెళ్లుచుండగా, కాపలా వాడిని ఖంగు తినిపించి, ముసుగు వేషధారిగా మార్తాండ వర్మ మెరుపులా గుహలో ప్రవేశించి, విక్రమ వర్మ భేతాళుడితో కొద్దిసేపు యుద్ధము చేసి-వచ్చినంత వేగంతోనే మరలా వెళ్లిపోవును!

విక్రమవర్మ:- "వాణ్ణి వదలకండి! పట్టుకోండివాణ్ణి, బంధించండి!(మార్తాండ వర్మ వెళ్లిపోవును) చీమల బారుల్లాగా మనుషులున్నారు. ఒక్కణ్ణి పట్టుకో లేకపోయారు..! భేతాళా! వీడెవడో మన ఆశలకు అడ్డు తగలడానికి తయారయాడు. వాడి జాడ తెలుసుకొని వాణ్ణి హతమార్చాలి!"

తాగిందంతా దిగి పోయింది విక్రమ వర్మకు. ఇప్పటిదాకా వీళ్లు చేసిన యుద్ధపు శబ్దాలకు బిలబిల మంటూ పదిమంది అంగ రక్షకులు ఈటెలు లాంటి ఆయుధాలు చేతిలో ధరించి వచ్చి విక్రమ వర్మ, భేతాళుడి ముందు వాలారు.

భేతాళుడు:- "మనకు శతృవులు ఎవరున్నారు? మనగుట్టు వాళ్లకెలా తెలిసింది? ఇదంతా యువరాజు మార్తాండ వర్మ పన్నిన పద్మ వ్యూహమే అయివుంటుంది. లేకపోతే...ఇంతకు ముందు మనకు వేరొకళ్లు శతృవులే గాని, మనము ఎవరికీ శతృవులము కాదు. అలాంటిది ఇప్పుడు మనం ఒకరికి శతృవులమై-మన నీడలకు కూడా మనమే భయపడే పరిస్థితులు వచ్చినయ్!"

ఇప్పటి వరకూ పులివన్నె గాంభీర్యంతో కుయుక్తులు పన్నుతూ వస్తున్న భేతాళుడు... ఇప్పుడు అసలు పులి ఇక్కడికే వచ్చి తన పంజా విసిరి వెళ్లేసరికి-దాని సహజ సామర్థ్యం రుజువు కావడంతో, ఆలోచనలో పడ్డాడు భేతాళుడు!

విక్రమవర్మ:- "భేతాళా! అంత బేల తనంగా మాట్లాడకు. విజయ నగర సామ్రాజ్య ప్రజలలో-ఏ ఒక్కరి రక్తాన్ని శతృవులు తాక ప్రయత్నించినా, అగ్ని కణాలతో అవివేకి చలగాట మాడినట్లే అవుతుంది!"

ప్రజల గురించయితే బాగానే ఆలోచించాడు గాని, తన కుటుంబ సభ్యుల గురించే సరిగా ఆలోచించ లేక పోయాడు విక్రమ వర్మ. భేతాళుడితో తను ఇప్పుడు అనిన విధంగానే బయట వాళ్లతో కలిసి తనుచేసే ఈ అతి సాహసానికి, అసహజ ప్రయత్నానికి, ఆ ప్రజలే తన విషయంలో ఎలా రియాక్టవుతారని మాత్రం-ఆలోచించ లేక పోయాడు. అర్థం చేసుకోలేక పొయాడు!

భేతాళుడు:- "ఆ శక్తి సామంతుని ద్వితీయ పుతృడవని, అద్వితీయ పరాక్రమ వంతుడవని, ఆ వీర రక్తము నీలో తొణికిస లాడుతుందని, మోసాన్ని ఖండించి-రాజ్యసింహాసనం చేపట్టగల ధైర్య, సాహస, వీర విక్రమ చక్రవర్తి కావాలనే... నా యుక్తితో శక్తి వంచన లేకుండా సాయపడటానికి సిద్ధంగా ఉన్నాను!"

ఆకాశానికెత్తే ప్రయత్నం చేశాడు భేతాళుడు! ఎదుటి వాడి బలహీనతను ఆసరాగా చేసుకొని, దాన్ని అడ్డుగా పెట్టుకొని, వాణ్ణి ఒక ఆటాడించే నేర్పరితనం భేతాళుడికి వెన్నతో పెట్టిన విద్య! అది అతగాడికి ఎలా అబ్బిందో తెలియదుగాని, విక్రమ వర్మ పైన మాత్రం వాడు ఎంతో చాకచక్యంగా ప్రయోగించాడు ఆ అస్త్రాన్ని!

విక్రమవర్మ:- "అందుచేతనే నీ సలహాకు శిరస్సు వంచాను మితృని వలె సలహాలిచ్చి, పితృ వాక్యాలలో గల కుతంత్రాలను ఎత్తిచూపి-నా బాల ప్రాయాన్ని పారద్రోలిన నీవు నా ఆప్తుడవని భావించాను, ఆత్మీయతతో శిరసావహించాను!"

తండ్రితోను, అన్నతోను తగవు పెట్టుకొని, రాజ్య భాగాలు గావించమని సలహా ఇచ్చినవాడు ఆప్తుడట! ఎప్పుడూ మత్తులో ముంచి తేల్చుతూ, ముచ్చట పడ్డ ముద్దు గుమ్మను పచ్చి బ్రోకరులా తార్చుతూ బ్రతికేవాడు ఆత్మీయుడట! అలాంటి వాళ్లకు ఎంతటి ప్రాధాన్యత, మరెంతటి ప్రాముఖ్యత!

భేతాళుడు:- "అందుకే గదా...రాజును మించినవాడు 'మంత్రి'- అన్నారు పెద్దలు! సలహాలు ఇవ్వడం లోనూ, సహాయాలు చెయ్యడంలోనూ,

సకాలంలో ఆలోచించి చెయ్యడమే మనలోని ప్రత్యేకత!"

ఎదుటివాడు మనల్ని కొద్దిగా పొగడగానే మనలో ఎక్కడ లేని అహం ప్రవేశిస్తుంది! నాలో అంత గొప్పదనం ఉంది గామోసు–అనే గర్వం కలిగి, తనను తానే కీర్తించుకొనే వాడిగా తయారవుతాడు! అక్రమంలో తన సహజ సామర్థ్యాన్ని కూడా కోల్పోతాడు. ప్రస్తుతానికి అదే పరిస్థితిలో ఉన్నాడు భేతాళుడు.

వెంకడు:– "దొరా! మన గొప్పలు మనమే శెప్పుకుంటా కూకుంటే ఎట్టా! ముందు జరగాల్సింది శానా ఉందిగదా? అదేది ఆలోచించ కుండా–ఇదేంది దొరా?"

అని భేతాళుడికి హితబోధ చేస్తాడు వెంకడు. పాపం...తనకు ఉప్పు పులుసు పెట్టే ఏ అయ్య క్కూడా అన్యాయం జరగడం గాని, అక్రమం పెరగడంగాని, జరుగుతూ ఉంటే చూస్తూ ఉండలేదు వాడి మనసు.

ఎప్పటి పరిస్థితులకు తగ్గ సలహా అప్పుడు చెప్తుతూ ఉంటాడు. ఒక్కోసారి వాళ్లక్కూడా అనుమానం కలుగుతూ వుంటుంది వీడిమీద! వీడు అసలు మన తరుపున ఉన్నాడా... లేక అవతలి వాళ్ల తరుపున మాట్లాడుతున్నాడా అని! అదే విచిత్రం! కొన్ని కొన్ని కేరెక్టర్లని అర్థం చేసుకోలేం, అనుమానించనూ లేముకూడా!

భేతాళుడు:– "అవును. కథ మంచి రస పట్టులో ఉంది! ఏమరుపాటుగా ఉంటే–సోమరి వాటమే అవుతుంది. దొరా! ఇంకా ఆలోచిస్తా కూర్చుంటే లాభం లేదు. మనం రేపు రాత్రికే కోటలో ప్రవేశించాలి!"

ఆమాటతో విక్రమ వర్మకు ఉత్సుకత పెరిగింది. ఉల్లాసం కలిగింది. తన కార్య భారానికి భేతాళుడి సహకారం సంతోషాన్ని కలిగించింది, సమరోత్సాహాన్ని పెంచింది!

విక్రమవర్మ:– "ప్రవేశించి?"

ఏంచేద్దామో చెప్పు? అన్నట్టు ఆతృత కనబర్చాడు విక్రమ వర్మ.

భేతాళుడు:– "నీ అన్న మార్తాండ వర్మను..."

భేతాళుడి నోటి నుండి ఆ పదం పూర్తి కాకుండగనే విక్రమవర్మ అందుకుని...

విక్రమవర్మ:- "హతమార్చాలి".

విక్రమవర్మ నోటినుండే అంతటి మాట రావడంతో ఆనందపరవశుడైన భేతాళుడు-ఆ పైన జరగ వలసిన కార్యక్రమాన్ని విపులంగా విశదీకరించాడు.

భేతాళుడు:- "తరువాత మహారాజును..."

మరలా భేతాళుడి మాట పూర్తి కానివ్వకుండగనే, అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తూ అమంగళ కర వాక్కును, ఆలోచనా రహితుడిగా అనేశాడు విక్రమవర్మ.

విక్రమవర్మ:- "చెరసాలలో పెట్టాలి!"

తన కుటుంబ సభ్యు లిరువురిపైనా రెండు రకాలైన దాడులు అతగాడి నోటి వెంటే రావడంతో, కాగలకార్యం గంధర్వులే తీర్చారన్నట్టు-జరగబోయే ఉపద్రవానికి సూత్రధారి, పాత్రధారి కూడా అతడే నన్నట్టు రూపు గావించాడు, తీర్పు రావించాడు భేతాళుడు!

భేతాళుడు:- "తదుపరి మన కర్తవ్యం సాధించాలి!"

వీరి మంత్రాంగ మంతా విజయుడు చాటుగా ఉండి, మాటు వేసి వింటున్న సంగతి వీళ్లలో ఏ ఒక్కరూ గమనించ లేక పోయారు! పథకాలు పన్నేముందు పరిసరాలను కూడా గమనినిస్తూ మరీ పాచికలు వెయ్యాలి. అలాంటి ఇంగితం వాళ్లలో లోపించిన కారణంగానే-అదికాస్త విజయుడి చెవులబడింది! వాళ్లకుగల అత్యాశే వాళ్ల బుద్ధిని మాంద్యతగావించింది, మత్తులో ముంచి వేసింది!

(4వ రంగం సమాప్తం)

## (5వ రంగం)

విజయుడు ఉన్నఫళంగా గుహలో నుండి బయటకొచ్చి, ఎవరికంటా పడకుండగా కోటవద్దకు చేరుకుంటాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ వాళ్ల పథకం పారకుండగా చెయ్యాలనేది విజయుడి సంకల్పం! వాళ్లను కోట చాయలకు్కూడా రానివ్వకుండగా చెయ్యాలి.

అలాగ జరగాలంటే ముందు మార్తాండవర్మకు ఈ విషయం వెంటనే తెలియజెయ్యాలి. అనుకొని-రొప్పుతూ, రోస్తూ మార్తాండ వర్మను చేరుకుంటాడు.

విజయుడు:- "యువరాజా! ఆపద...అడ్డుకోలేనంత ఆపద! అపర భేతాళుడి కుయుక్తులతో-అదిరిపోయే టంతటి ఆపద! అపర చాణక్యుడి కుటిల వ్యూహంతో, అతిరథ మహా రథులకే ఎనలేని ఆపద, కనలేని మనోవ్యథ!"

గుక్క తిప్పుకో కుండగా విజయుడు ఒక్కొక్క ఆపదను లెక్కకు మిక్కిలిగా చిత్రిస్తూ, తాను విన్న రహస్యం ఎంతో ప్రాధాన్యత గలదిగాను, ప్రాముఖ్యత చెందినది గాను చెపుతూ, మార్తాండ వర్మకు ప్రమాద హెచ్చరికను జారీచేశాడు!

మార్తాండవర్మ:- "విజయా! ముందు నువ్వు ఇలా వచ్చికూర్చో! (విజయుడు వచ్చి మిత్రుడి ప్రక్కన కూర్చుంటాడు)

ఆ... ఇప్పుడు చెప్పు! అసలేం జరిగింది? ఏవిటి ఆపద? ఎవరికి ఆపద?..."

విజయుడు సాధారణ విషయాన్ని కూడా, అసాధారణమైనదిగా భ్రమించి-మార్తాండ వర్మను విస్మయానికి గురిచేస్తూ ఉండడం విజయుడికి అలవాటే గనుక, ఇప్పుడు తను చెప్పబోయే విషయానికి పెద్దగా ఆతృత చెందకుండగాను, ఆవేశం పొందకుండగాను, అతి మామూలు విషయాన్ని అడిగినట్టే అడిగాడు మార్తాండ వర్మ.

విజయుడు:- "ప్రళయం! భరించరాని ప్రళయం! అన్నదమ్ముల పోరాటంలో అంతులేని ప్రాణాపాయ కరమైన ప్రళయం, మహాప్రళయం!"

అసలు విషయాన్ని అదిమి పట్టి, కొసరు విషయాలు-గోరంతదాన్ని కొండంతగా చిత్రించి చూపుతూ, మిత్రుడిలో ఆరాటాన్ని అధికం గావించి, తాను ఆనందాన్ని అమితంగా పొందాలని తెగ ఆశపడుతూ వుంటాడు విజయుడు.

మార్తాండ వర్మ:- "అబ్బబ్బ...! నన్ను చంపుకొని తినక అసలేం జరిగిందో త్వరగా చెప్పవయ్యా?"

మార్తాండ వర్మలో కలిగిన విసుగల దలను గమనించిన విజయుడు, ఇక ఈ విషయాన్ని అట్టే సాగదీస్తూ పోతే, మిత్రుడిలో సహనం నశించి మా స్నేహాని కెక్కడ విఘాతం కలుగు తుందోనని భావించి...

విజయుడు:- "అన్న మార్తాండ వర్మను చంపి వేయాలని, తండ్రిగారైన మహారాజుల వారిని చెరసాలలో పెట్టాలని, ఆ తదుపరి ఈ సకల సామ్రాజ్యాన్ని వాళ్లే సొంతం చేసుకొని నిరాఘాటంగాను, నిరభ్యంతరంగాను, నిర్మొహ మాటంగాను, ఇంకా చెప్పాలంటే నిరంకుశంగాను పరిపాలించాలించాలని భేతాళుడి దురాశ-తమ్ముడుంగారి ఆశ!"

విషయాన్ని వివరించే క్రమం వివరణాత్మకమై ఉండాలి. విషయ పరిజ్ఞానంతో కూడినదై కూడా ఉండాలి. అప్పుడే దాని జఠిలత్వం గోచరమయ్యేది. వాళ్ల కుఠిలత్వం కూకటి వ్రేళ్లతో కూల్చ గలిగేది! ఇప్పుడు తెలియాలి మార్తాండ వర్మ తీసుకునే నిర్ణయం-వాళ్ల చాదస్తపు స్థితిని పెంచుతుందో, చపలత్వపు పరిస్థితిని తెంచుతుందో!

మార్తాండవర్మ:- "ఆఁ..! అందుకు తమ్ముడు విక్రమ వర్మ అంగీకరించాడా?"

విక్రమ వర్మ వ్యతిరేకించి ఉంటాడని మార్తాండవర్మకు చిన్న పాటి ఆశ! అందుకు విజయుణ్ణి ప్రశ్నార్థకంగా చూస్తూ మరీ అడిగాడు. ఎంతైనా తోడ బుట్టినవాడు కదా! అందులోనూ చిన్నవాడు. ప్రతి అన్నకు కూడ తన తమ్ముడిపై ఎందుకో తెలియదుగాని, ఒక పితృభావన లాంటిది-జనింప జేశాడు ఆ భగవంతుడు!

విజయుడు:- "అంగీకరించక ఏంచేస్తాడు! ఆటబొమ్మై వాళ్ల చేతిలో చిక్కిం తరువాత! వాళ్లు చెప్పినట్టల్లా ఆడాలి గదా? వాళ్లు చెయ్యమన్నట్టల్లా చెయ్యాలి గదా!"

కన్నతల్లి చిన్నతనంలోనే కాల గర్భంలో కలిసిపోతే.. ఆ బిడ్డల పెంపకంలో దొర్లే లోపం విక్రమ వర్మ రూపంలో మహారాజుకు అగుపించ సాగింది! అర్థమయేలా చేసింది! అది ఎంతగా తనను బాధిస్తున్నదంటే... భార్య పోయిన దిగులు కంటే కూడా కొడుకు చెడు ప్రవర్తన తీరు, రాజ్యానికి చేటు కలిగించే లాగుంటే, కన్న తండ్రి మనసుకు బాధ కలిగిస్తోంది; క్షోభ రగిలిస్తోంది! అది తెలుసుకున్న మార్తాండ వర్మ తమ్ముణ్ణి ఎలాగైనా దారికి తేవాలని ప్రయత్నించాడు-కాని... తీరు మారినట్టుగా కనిపిస్తూ ఉంది!

మార్తాండవర్మ:- "అయితే వాళ్ల వ్యవహారం అంతదూరం వచ్చిందన్న మాట! ఇక ఉపేక్షించి లాభం లేదు. మన మంచి తనాన్ని వాళ్లు బలహీనతగా

భావించి నట్టున్నారు! ఇప్పుడు మనం ఒక పనిచెయ్యాలి విజయా!"

ఇక ఆలస్యం చేస్తే అనేక అనర్థాలకు అవకాశం కల్పించిన వాళ్ల మవుతామని, వాళ్ల ఆగడాలు మరింతగా పెచ్చరిల్లి రకరకాల కపటోపాయాలతో-వికృత చేష్టలు గావిస్తూ ఉంటే- మన పొరుగు రాజుల ముందు మనం చులకన గావడమే కాకుండగా, వాళ్లకు మనపైన తేలిక భావం ఏర్పడేలా-అవకాశం కల్పించిన వాళ్లం కూడా అవుతా మనుకొని, ఒక నిర్ణయాని కొచ్చాడు మార్తాండ వర్మ!

విజయుడు:- "ఒక్క పనేవిటి!...మనం ఎన్నో పనులు చేస్తున్నాం గదా?"

అమాయకత్వం నిండిన స్వరంతో అదే ధోరణిలో అడిగాడు విజయుడు! మిత్రుడు పథకం వేస్తే అది ప్రయోజనాన్ని కలింగిచేలా వుండాలి; ప్రయోజకత్వం చిగురించేలా వుండాలి, ప్రయోగ తత్వం అనిపించేలాగు ఉండాలి! అదే విజయుడి ఆశ!

మార్తాండవర్మ:- "విక్రమ వర్మను ఎలాగైనా మనం బంధించి తీసుకురావాలి! అప్పుడే దీనికో రూపం ఏర్పడేది; వాళ్లు ఏర్పర్చుకున్న మార్గం మూత పడేదీనూ?"

కొన్ని నిర్ణయాలు కొంత కఠిన తరంగా తీసుకో గలిగితేనే, కొన్ని కార్యాలు కొంత సులభ తరంగా సాగించ గలిగేది, సాధించ గలిగేదీను!

విజయుడు:- "దాని వల్ల ప్రయోజనం? ఆ పని చేసినందు వలన విక్రమ వర్మలో మీపైన, మహారాజుపైనా ద్వేషం మరీ పెంచిన వాళ్లవు తారేమో?"

తన సందేహాన్ని కనబర్చాడు విజయుడు. ఒకవేళ వీళ్ల పథకం గనుక బెడిసి కొడితే గనుక, విజయుడు అన్నది కూడా నిజం కావడానికి అనేక మార్గాలు కాచుకొని మరీ, ఎదురుచూస్తూ ఉంటాయనేది అక్షర సత్యం! అందుకే విజయుడు అలాంటి సందేహం కూడా మిత్రుడి చెవిన ముందుగా వేసింది; చెప్పి చూసిందీను!

మార్తాండవర్మ:- "రాజ్యకాంక్షతో వున్న భేతాళుడు తమ నాయకుణ్ణి ఎవరో బంధించి తీసుకు వెళ్లేరని తెలియగానే, తన ఆశలకు అంతరాయం కలిగిందని, తమ వద్దకు ముసుగు మనిషి, సిపాయిలుగా వచ్చిన వాళ్లను మహారాజు యువరాజే కుతంత్రాలు పన్ని పంపి ఉంటారని

మన మీదకు దాడిచేస్తారు. అప్పుడు వాళ్లను మనం సులువుగా బంధించవచ్చు!"

తాను ప్రయోగించిన పథకం యొక్క ప్రయోజనాన్ని విశద పరచాడు, వివరించి మరీ చెప్పాడు మార్తాండ వర్మ విజయుడికి! అయినా అంత తేలిగ్గా విజయుడు వొప్పుకుంటాడా! అసలే ప్రతి విషయాన్ని పదే పదే అనుమానించే స్వభావం గలవాడాయె!

విజయుడు:- "అదికాస్త బెడిసికొట్టి-మన పథకం కాస్త ఎదురు తిరిగి, ఒకవేళ వాళ్లే మనల్ని బంధిస్తే?"

కీడెంచి మేలెంచ మన్నట్టూ, అతి నమ్మకంతో ఏపనీ చేయవద్దన్నట్టూ, దీన్నికూడా ఆలోచించి మరీ చేయ మన్నట్టు, మార్తాండ వర్మకు హెచ్చరిక లాంటిది జారీ చేశాడు విజయుడు!

మార్తాండవర్మ:- "అది తరువాత సంగతి..! ఎట్టి పరిస్థితిలోను అలాగ జరగదు! ఒకవేళ అలాగనుక జరిగితే-దాన్ని గురించిన జాగ్రత్త కూడా తీసుకోవడం జరుగుతుంది! ముందు మనం వేషాలు మార్చుకొని మారు వేషంలో వెళ్లాలి."

ఆ విషయంగా కూడా తాను ముందుగానే ఆలోచించి ఉన్నట్టూ దానికి సంబంధించిన జాగ్రత్తల తోనే అక్కడికి వెళ్లటం కూడా జరుగుతూ ఉన్నట్టు విజయుడికి నమ్మకం కలిగించేలా వివరించి మరీ చెప్పాడు మార్తాండ వర్మ. కానీ...ఏమి చేస్తున్నదీ... ఎలా చేస్తున్నది మాత్రం చెప్పలేదు!

విజయుడు:- "యువరాజా! చిన్నవాడినో...పెద్దవాడినో చెపుతున్నాను కాస్త నామాట వినవయ్యా! వాళ్లతో కయ్యానికి దిగటం కొరివితో తల గోక్కున్నట్టు ఉంటుందేమో కాస్త ఆలోచించవయ్యా!"

విక్రమ వర్మను బంధించి తీసుకొని రావడం అనే ఆలోచన విజయుడికి ఎందుకనో అంత సరైందిగా అనిపించక పోగా, కాస్త బాధగా కూడా అనిపించింది! అతన్ని దారికి తీసుకు రావాలనే మిత్రుడి ప్రయత్నం కాస్త బెడిసికొట్టి, పట్టుదప్పి గట్టు దాటుతుందేమోనని, మరోలా గెలాగైనా ప్రయత్నించి చూడ మన్నట్టు-అన్నిటికీ అనుమానాలు వ్యక్తం చేస్తూ, అడ్డంకులు చెపుతూ రాసాగాడు విజయుడు!

మార్తాండవర్మ:- "విజయా! ఎప్పుడూ పిరికి తనంగా మాట్లాడటం తప్ప ధైర్యంగా ఒక్కసారి కూడా మాట్లాడి ఎరుగవు గదా!"

కొంత అసహనాన్ని ప్రదర్శిస్తూనే, మిత్రుడిని ఒట్టి పిరికి వాడివంటూ చురకంటించాడు మార్తాండ వర్మ! అతని ఆంతర్యం కొంతలో కొంత తెలిసిన వాడైన కారణంగాను, మరో ఆలోచనకు అవకాశం లేదని పించాకే ఈ నిర్ధారణ కొచ్చాడు మార్తాండ వర్మ.

విజయుడు:- "అయ్యో! కత్తులతో పోరాడి, కుత్తుకలు కత్తిరించి, నెత్తురు కళ్ల జూడటం నావల్ల కాదు బాబు!"

అంటూ తన అహింసా వాదాన్ని ప్రదర్శించాడు విజయుడు! దాంతో మార్తాండ వర్మకు చిర్రెత్తు కొచ్చింది. ఇక ఇతనితో మాటలు అనవసరం అనుకొని...

మార్తాండవర్మ:- "సరే! అయితే నువు రావద్దులే...! నేనే ఒంటరిగా వెళతాను!"

అని ముందుకు కదిలి వెళ్లబోతాడు మార్తాండ వర్మ! ఠక్కున మిత్రుడి చెయ్యి పట్టుకొని ఆపి...అతగాడిని ఎగాదిగా చూస్తూ...

విజయుడు:- "అయితే నువ్వు ఒంటరిగానే వెళతా నంటావా?"

అని ఆశ్చర్యాన్ని నటిస్తూ అడుగుతాడు విజయుడు! ఎందుకంటే... ఇంత వరకు తాను వెంట లేకుండగా అతనొక్కడే ఎక్కడికీ వెళ్లిన దాఖలాలు లేవు! కాకపోతే-విక్రమ వర్మ సమస్య ఉత్పన్న మయ్యాకే కొన్ని ఎడబాటులూ, కొంత తడబాటూను!

మార్తాండవర్మ:- "ఏం వెళ్లలే నంటావా? నువ్వెంట లేకుండా నేనెక్కడికీ వెళ్ల లేననేగా నీ ధైర్యం?"

అంటూ మిత్రుణ్ణి కోపంతో చూస్తాడు మార్తాండ వర్మ! నిజం చెప్పాలంటే ఇంతకాలం జరుగుతూ వస్తున్నదదే! ఎందుకనో తెలియదుగాని ఆఖరికి మహారాజు కూడా మార్తాండ వర్మను ఎక్కడికైనా పంపేముందు విజయుణ్ణి కూడా వెంట తీసుకొని వెళ్లు అనడం అలవాటై పోయింది!

విజయుడు:- "అహఁ...అలాగని కాదు. నువొక్కడివే వెళతావా అని అంతే!"

అని నొన్నుతూ అలాగే చెయ్యి వదలకుండా పట్టుకొనే ఉంటాడు విజయుడు.

మార్తాండవర్మ:- "అనుమానంగా వుందా? చెయ్యి వదులు వెళతానో లేదో చూద్దుగాని!"

బింకంగా అయితే అలా అన్నాడు గాని, విజయుడు తన ప్రక్కన లేకుండగా తాను ఎక్కడికైనా వెళ్లివున్నాడా..! ఏపనైనా చేసివున్నాడా! కాకపోతే అతగాడు లేకుండగా తాను ఎక్కడికీ వెళ్లలేదు-అన్నంతగా విజయుడు ఫోజు లిచ్చేసరికి అలా వ్యవహరించాడు గాని...!

విజయుడు:- "అవమానంగా కూడా ఉంది! నాలాంటి మానవుడివి, నాకు చిన్న నాటి నుండి మిత్రుడివి..! బలా బలబాలలో నాకంటే ఏ మాత్రం మించిన వాడివికావు! అలాంటి నీవు.. శత్రువుల మీదకు కత్తి యుద్ధానికి వెళుతూవుంటే, అసమర్థుడి వలె నేను ఇంట్లో కూర్చోవడమా! ఛ...ఛ...! ఇంతకంటే అవమానం ఇంకేమైనా ఉందా? పద... నేను మీతో యుద్ధం చేస్తాను."

అని కత్తిదూసి మార్తాండ వర్మతో యుద్ధంచేయ బోయిన వాడిలా నటిస్తాడు. దాంతో మార్తాండ వర్మ ఫక్కున నవ్వి-విజయుణ్ణి అభిమాన పూర్వకంగా ఆలింగనం చేసుకొని బయలుదేరబోతాడు. ఇంతలో విజయుడు ఠక్కున ఆగిపోయి..ఏదో అనుమానం స్ఫురించిన వాడిలా...!

విజయుడు:- "యువరాజా! ఒకవేళ నేను శత్రువులతో పోరాడి పోరాడి మరణిస్తాననుకో..! నాకు వీర స్వర్గం దొరుకు తుందంటావా? అజేయుడిగా నాపేరు నిలుస్తుందంటావ?"

విజయుడు నామధేయంతో విరాజిల్లే మిత్రుడు-అజేయుడిగా కీర్తి ఘడించాలని కోరుకోవడం అత్యాశ కాకపోయినా... ఇది అసందర్భ ప్రేలాపనగాను, అసంకల్పిత భావన గాను భావించిన మార్తాండ వర్మ అసహనాన్ని ప్రదర్శిస్తూ...

మార్తాండవర్మ:- "వీర స్వర్గము లేదు.. సూర స్వర్గము లేదు పదవయ్యా! (అంటూ విజయుణ్ణి నెట్టుకొంటూ తీసుకొని వెళ్లిపోవును)

(5వ రంగం సమాప్తం)

## (6వ రంగం)

అది అర్ధరాత్రి సమయం. విజయుడు వెంటనుండగా మార్తాండ వర్మ, మరికొంత మంది పరివారాన్ని వెంట నిడుకొని-గుహ వెలుపల మాటువేస్తాడు. అక్కడ కాపలా కాస్తూ ఇద్దరు పనివాళ్లు కనిపిస్తారు. వాళ్లచేతిలో బల్లెము లాంటి ఆయుధాలు కలిగి, భీకరాకారము గల ధృడకాయులే కాపలాగా నియమింప బడి ఉంటారు!

మార్తాండ వర్మ మత్తు మందు నింపిన గుడ్డను ఒక చేతిలో ఉంచుకొని, ప్రక్కవాటుగా చిన్నగా నక్కి నక్కి నడుస్తూ వాడి వెనుక వైపుకు వెళ్లి, మత్తు మందుతో కూడిన గుడ్డగల చేతిని వాడి ముక్కు వద్దకు పోనిచ్చి, వాడు తిరగాలని ప్రయత్నించే లోపు-రెండవ చేతితో వాడి తలను గట్టిగా అదిమిపట్టి-వాడు స్పృహ కోల్పోయేలా చేస్తాడు!

రెండవ వాణ్ణి కూడా అదే పద్ధతిలో స్పృహ కోల్పోయేలా చేసి, ఇద్దరూ గుహలోనికి ప్రవేశిస్తారు!

ఆదమరచిన నిద్రలో ఉంటాడు విక్రమ వర్మ. అది చూసిన విజయుడు మార్తాండ వర్మతో...

విజయుడు:- "యువరాజా! విక్రమ వర్మ తప్ప ఎవరూ లేనట్టున్నారు! భేతాళుడు కూడా లేడు. మన పాచిక పారింది!"

సహజంగా ఎప్పుడూ విక్రమ వర్మకు చేరువలో కనీసం నలుగురైనా అందుబాటులో నిద్రిస్తూ ఉండేవాళ్లు. అలాంటిది ఈ రోజు ఎందుకనో ఒక్కరు కూడా అతగాడికి చేరువలోగాని, తోడుగా గాని లేరు !

మార్తాండవర్మ:- "శూ౦...! పెద్దగా మాట్లాడకు ఎవరైనా వింటారు! నువ్వు బైట వాకిలి దగ్గరుండి ఎవరైనా అటునుండి వస్తారేమో చూస్తూ వుండు! ఇక్కడ మరి కొందరెవరైనా నన్ను ప్రతిఘటించేవాళ్లుగాని, నాకు ప్రయాస కలిగించే వాళ్లుగాని వస్తే, అప్పుడు నేను నిన్ను పిలుస్తాను. అప్పుడు నువ్వు మన పతాలాన్ని తీసుకొని వెంటనే వచ్చేయి!"

అని విజయుడికి పురమాయించి అవతలికి పంపే ప్రయత్నం చేస్తాడు మార్తాండ వర్మ.

విజయుడు:- "సరే! అలాగేగాని, నీవు మాత్రం జాగ్రత్త సుమా! ఈ కోయవాళ్లు అనేక మాయలు నేర్చిన వాళ్లు ఎక్కడ ఏ వల ఎలా పన్ని ఉంటారో చెప్పలేము!"

వాళ్ల గురించి ఈ కొద్దిరోజుల్లో తాను తెలుసుకున్న దానిలో ఇదీ ఒక భాగమే గనుక, మిత్రుడికి చిన్న హెచ్చరిక లాంటది చేశాడు విజయుడు.

మార్తాండవర్మ:- "అందతా నేను చూసుకుంటానుగాని... ముందు నువ్వెళ్లి బైట ఎవరన్నా వస్తున్నారేమో జాగ్రత్తగా చూస్తూ ఉండు!"

తొందరగా వెళ్లు అని చెప్పి విజయుణ్ణి పంపి, విక్రమ వర్మ పడుకొని ఉన్న దగ్గరకు మార్తాండ వర్మ వచ్చి, తన కరవాలంతో అతగాడు కప్పుకొని వున్న దుప్పటిని తొలగించి వేస్తాడు.

మార్తాండవర్మ:- "విక్రమ వర్మా! లే...పైకి లే!!"

గద్దింపు లాంటి స్వరంతో నిద్ర లేపుతాడు త్రుళ్లిపడి పైకి లేచిన విక్రమ వర్మ ముసుగు వేషంలో నున్న మార్తాండ వర్మను చూసి..!

విక్రమవర్మ:- "నువ్వా! ఎవరక్కడ! వీణ్ణి పట్టుకోండి!"

అంటూ నలుదిక్కులా కేకలు పెడతాడు. కాని ఎవ్వరూ రారు! తన కరవాలం కొరకు అంతా వెదకుతాడు. కాని ఎక్కడా అది కనిపించదు! ఇంతలో మార్తాండ వర్మ...

మార్తాండవర్మ:- "నీరంకెలకు భయపడి పరుగులు తీస్తూ వచ్చే నీ మురా అంతా- చల్ల గాలిలో హాయిగా నిద్రిస్తూవుంది! నువ్వెంతగా కేకలు పెట్టినా ఎవ్వరూ రారు! ఎందుకు వృథా ప్రయాసపడతావు?"

ముసుగు మనిషి ఆవిధంగా అనడంతోనే తన వాళ్లందర్ని ఇతడేమైనా చేసివుంటాడా! అనే అనుమానం విక్రమ వర్మకు రాసాగింది! ఇంత జరుగుతున్నా ఏమీ తెలియనంత మొద్దు నిద్ర పొయ్యానా అనుకొంటూ...!

విక్రమవర్మ:- "భేతాళా!! ఏమైపోయారంతా! ఒక్కరూ పలకరేం...?"

అంటూ అసహనంగా అరుపులూ, కేకలతో రంకెలు వేస్తూ వుంటాడు విక్రమ వర్మ! అది వినిన విజయుడు నలుగురు సైనికులను లోపలికి పంపుతాడు. వాళ్లు వచ్చి ప్రక్కనే గల రెండు ద్వారముల దగ్గరా చెరిద్దరి చొప్పున కాపలా కాస్తూ ఉంటారు. ఎవరైనా వస్తే ప్రతిఘటించడానికి.

మార్తాండవర్మ:- "భేతాళుడు!..భేతాళ విగ్రహాన్ని చూసి భయపడి నట్టు భేతాళుణ్ణి చూసి భయపడుతున్నావు! మీ పెద్దల గౌరవాన్ని మంటగలిపి, వంశ ప్రతిష్టను భ్రష్టు పట్టించి, నిన్ను నమ్ముకొని ఆశలన్నీ నీ మీద పెట్టుకొని అలమటిస్తున్న మహారాజును, నీ అన్న మార్తాండ వర్మను తిరస్కరించి-క్రూర మృగాల బంధికానాలో బడి తన్నుకులాడు చున్నావు!"

అంటూ తన మనసులో ఉన్న బాధను, వేదననూ ఒక్కసారిగా వెళ్లగ్రక్కే క్రమంలో-వాడు చేసిన తప్పు ఎంత పెద్దదో.. వాడు చేరిన చోటు ఎంద చెడ్డదో-తెలియ జెప్పే ప్రయత్నంగా కాస్త మందలింపు ధోరణిలో మాట్లాడ సాగాడు మార్తాండ వర్మ..!

విక్రమవర్మ:- "చాలించు నీ ముతక వేదాంతం! నోటికి వచ్చినట్టు వాగితే పాటికి ప్రయాణం కట్టవలసి ఉంటుంది జాగ్రత్త!"

హెచ్చరింపు ధోరణిలో పెచ్చరిల్లిపోయి మరీ మాట్లాడాడు విక్రమవర్మ. ఏ ఒక్కరూ తనకు తోడు లేక పోయినా, నోటికి ఎంత వస్తే అంత మాట్లాడుతూ, తనని తాను అదుపు చేసుకోలేని మనస్తత్వం విక్రమవర్మది!

మార్తాండవర్మ:- "నీ ధాటీ నాకు తెలియంది కాదులే! కనుకనే ఈ నాటికైనా మనసు మార్చుకొని, తప్పు తెలుసుకొని, పెద్దలతో ఏకీభవించి బుద్ధిగా ప్రవర్తించడానికి-ప్రయత్నించ మంటున్నాను!"

పెద్దరికం పిన్నలకు బుద్ధులు నేర్పాలని చూస్తుంది. శుద్దులు బోధించాలని తపన చెందుతుంది. తాపత్రయ పడుతుంది! అంతేగాని...తొందరపాటు చర్యలతో గందరగోళం సృష్టించి, హింసను ప్రోత్సహించాలని కోరుకోదు. వినాశనం కల్పించాలని ఆత్ర పడదు! మంద బుద్ధిని ఆసరా చేసుకొని, అందినంతా కాజెయ్యాలని ఆశపడదు, ఆరాటం చెందదు! అదే పెద్దరికము యొక్క ఉప యుక్తత, పరిపక్వత, ప్రశంసార్హతయున్నూ!

విక్రమవర్మ:- "నా ప్రయత్నాన్ని గురించి నీవు పదే పదే పరితపించ వలసిన పనిలేదు. నాకు బుద్ధులు నేర్పే క్రమంలో నీ హద్దు లేపాటివో నువ్వు తెలుసుకొని మరీ ప్రవర్తించు! మావాళ్లకు పట్టుబడి మట్టిపాలు కాకముందే-గుట్టుగా పారిపోలేదా-!"

దీన్నే కాబోలు మేకవన్నె-పులిగాంభీర్యం అంటారు! తనకు ఆసరా వచ్చువాళ్లు చేరువలో ఏ ఒక్కరూ కనిపించక పోయినా, ఎదుటి వాణ్ణి అదిరించో, బెదిరించో తనదే పైచేయి కావాలని కోరు కోవడం ఇలాగే వుంటుంది కాబోలు!

మార్తాండవర్మ:- "నీ కుంటి బెదిరింపులకు లొంగి పారిపోయే చంటి పాపాయిని కానునేను! మింటి నెగసే అగ్ని పర్వతం కంటికి అడ్డొస్తున్నా-ఒంటి కాలితో కుంటుతూనైనా వెంటపడి తరిమే తత్వమేగాని నాది. నీలాగ పంటి బిగువుతో బెదిరిస్తూ, కొంటె తనం ప్రదర్శించడం నాకు చేతకాదు! నీ వంటి అవివేకపు స్వభావులను వివేక వంతుని చేయడమే నా ప్రధమ కర్తవ్యం ప్రస్తుత ధర్మం కూడా!"

స్థిరత్వపు ఆలోచన, ధృడత్వపు నిర్ణయం ఇలాగే వుంటుంది! ఈ విధంగానే అంటుంది కూడా! కాకపోతే ఎదుటివాడు చెవులుండీ వినలేని చెవిటి వాడైతే మాత్రం చేయగలిగిందేమీ వుండదు. అటువంటి వాడికి ఎంత చెప్పినా ప్రయోజనముండదు; ఏమి చెప్పినా పరిపక్వతా చెందదు!

విక్రమవర్మ:- "ఎంత సాహసం! నా గుహలో ప్రవేశించి నన్ను చులకన చేస్తూ నాకే నీతులు బోధిస్తావా! చేతనైతే నాతో తలపడు!

అంటూ తన తలగడ క్రింద దాచి వుంచిన కరవాలాన్ని ఒక్క సారిగా బైటకు లాగి, మార్తాండ వర్మ మీదకు లఘించి యుద్ధానికి ఉసి గొల్పుతాడు; అతగాడిలో కసిని పెంచుతాడు! ఏ మాత్రం కూడా ఏమరుపాటు చెందని మార్తాండ వర్మ అరివీర భయంకరుడిలా విజృంభించి, తన ప్రతాపాన్ని ప్రదర్శించి అతగాడి 'అహం' అణచుతాడు; తల పొగరు కాస్తాదించుతాడు!

మార్తాండవర్మ:- "ఇప్పుడు చెప్పు! సక్రమంగా వచ్చి తండ్రిగారి వద్దా అన్నగారి వద్దా ఉంటానని మాటయిస్తే, నీపై ఆధారపడి ఈ గూడెంలో వున్న నీ ముఠా అంతా నాశనం కాకుండగా నేను కాపాడుతాను!

లేదా సర్వ నాశనం తప్పదు! మర్యాదగా నా మాట విను ఇప్పటికైనా మించి పోయిందేమీ లేదు".

పౌరుషానికి పోయి కత్తి యుద్ధానికి తలపడ్డ విక్రమ వర్మ మార్తాండ వర్మ చేతిలో చిత్తుగా వోడిపోయి, పరాభవ భారంతో తలదించుకొని నిలబడతాడు. అది చూసి మార్తాండ వర్మ హృదయం ద్రవించి పోతుంది. తనుగాని, తమ్ముడు గాని ఇలా ఎవరిముందూ తలదించు కొని నిలబడే పరిస్థితి రాకూడదనేదే మార్తాండ వర్మ అభిలాష, ఆకాంక్ష కూడాను!

కాని...వక్రమార్గంలో పయనం సాగించే విక్రమ వర్మకు ఇదెందుకు అవగత మవుతుంది, వేరే ఆలోచన ఎందుకు కలుగుతుంది?

విక్రమవర్మ:- "ఎవరూ లేని సమయాన గుహలో ప్రవేశించావు. భేతాళుడి కంట పడ్డావో-ప్రాణాలు దక్కవు జాగ్రత్త!"

చింత చచ్చినా పులుపు చావ లేదన్నట్టు...! వోటమితో ఏర్పడిన పరాభవం చేటని తెలిసొచ్చినా, విక్రమ వర్మలో ధీరత్వం తగ్గలేదు, ఇసుమంత కూడా భీరత్వం చూపలేదు! అదే రాచ పుట్టుకలో గల విలక్షణతా, సలక్షణతాను!

మార్తాండవర్మ:- "అది తరువాత సంగతి! ముందు చేతికి దొరికిన వానిని అంత తేలిగ్గా వొదిలేటంత అజ్ఞాని కాదు ఈ ముసుగు మనిషి తీసుకు పదండి!"

అని మార్తాండ వర్మ ఆజ్ఞాపించడం తోనే, సిపాయిలు తలొక ప్రక్క విక్రమ వర్మను చుట్టుముట్టి బందీని గావించి, గుహ వెలుపలకు తీసుకొని వెళతారు! ఇంత జరుగుతున్నా ఏ ఒక్కరూ చేరువలో లేని కారణంగా, వీళ్లను ప్రతిఘటించి ఎదిరించే వాళ్లు లేక పోవడం మార్తాండ వర్మ పథకానికి ప్రాణం పోసి నట్లయింది! ఎంత గొప్పగా మనం పథకం రూపొందించ గలిగినా, దానికి కాలం కూడా అనుకూలించి నపుడే-తమ పథకానికి సాఫల్యత చేకూరుతుంది, సార్ధకత శిద్ధిస్తుంది!

(6వ రంగం సమాప్తం)

## (7వ రంగం)

అది మహారాజు నివాస భవనము. అందులో ఇరువురు కుమారులకు వేరు వేరుగా వారి వారి సహధర్మ చారిణితో కలిసి కాపురము చేయులాగున, వారి వారి అభిరుచికి అనుగుణముగా, విశేషమైన అనుభవము గల పనివారలతో-వీనుల విందు గొలిపే సుందర శిల్పాలతో, అత్యంత రమణీయత ప్రతి కట్టడం లోనూ ఉట్టిపడేలా తీర్చి దిద్ది, తన కళాపిపాస అడుగడుగునా గోచరించేలా అత్యద్భుతంగా నిర్మాణం గావించాడు మహారాజు విజయేంద్ర వర్మ.

తనకు ప్రత్యేక వసతులతో కూడిన ప్రశాంత నిలయాన్ని కూడా అందు ఏర్పాటు గావించుకున్నాడు. ఆ మందిరంలో ఎవరు ప్రవేశించినా ఏదో తెలియని ఆధ్యాత్మికతతో నిండిన అనుభూతికి లోనవుతారు! అంతటి విశిష్ఠత గల్గిన ఆ మందిరంలో మహారాజు వంటరిగా తన ఆసనముపై కూర్చొని, విచార గ్రస్తుడై ఉంటాడు! అంతట మహామంత్రి ప్రవేశించి...

మహామంత్రి:- "మహారాజా! సర్వము తెలిసిన మీరే ఈ విధంగా విచారిస్తూ కూర్చుంటే ప్రయోజన ముండదు! దర్బారుకు రాకపోవడం ప్రజల యోగ క్షేమాలు విచారించక పోవడం ప్రభువులకు తగని పని. కష్టాలను ఎదుర్కోవాలి. మారు త్రోవ బట్టిన విక్రమ వర్మ జీవితాన్ని మరలించి మనవైపుకు లాక్కొనే విధాన మాలోచించాలిగాని.. ఇలా వంటరిగ నిరుత్సాహపడి కూర్చుంటే, ప్రజలలో కల్లోలము ప్రజ్వరిల్లి-పరాయి రాజులకు తెలిసి, ఇదే అదునుగా భావించి-వాళ్లు మన మీదకు దండెత్తి రావడం తప్పించి, మరే ప్రయోజనము ఉండదు!"

పరిపాలనా పరమైన విషయాలపై ప్రతిసారి మంత్రులతో కూడిన మంత్రాంగ చర్చలకై-ఎన్నిసార్లు తాను మహారాజుకు విన్నవించినా, సభను ఏర్పాటు గావించక పోవడం, ప్రజా సమస్యలు కుప్పలు తెప్పలుగా పేరుకుపోయి ఉండడంతో, బాధ్యతగల మంత్రిగా సాధ్యా సాధ్యాలు యోచనగావించి, సూచన ప్రాయంగా మహారాజుకు తెలియజేయాలనే సత్‌సంకల్పంతో, ఈ రోజున వారిని కలిసి తన సలహాను తెలియ జేయడం జరిగింది! అంతట మహారాజు నిర్వేదం నిండిన గొంతకతో...

మహారాజు:- "పరాయి రాజులు దండెత్తి వచ్చి-జయభేరి మ్రోగించి, రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని వున్నా నేనింతగా కలత చెందేవాణ్ణి కాదు. బాధపడి ఉండేవాణ్ణీ కాను! ధైర్య సాహసాలతో ముందు కురికి, పోరాడి రాజ్యాన్ని గెలుచుకున్నారని సమాధాన పడేవాణ్ణి, సర్దుకొని పోయేవాణ్ణి. రామ లక్ష్మణుల్లాగ ఇద్దరు కుమారులుండి, పరాయి రాజులు దండెత్తి వస్తే పరా కత్తులతో బదులు చెప్ప వలసిన వీళ్లు-అన్న దమ్ములని కూడా చూడకుండా ఈ విధంగా పోరాటాలు సాగించి, దండ యాత్రలకు శిద్దమయ్యారనే నా బాధ!"

ఎంతటి రాజ్యానికి మనం అధిపతుల మనేదికాదు! ఆ రాజ్యాధికారంలో ఎంతకాలం కొనసాగే మనేది అంతకంటే కూడా ముఖ్యం కాదు! ఎందు చేతనంటే.. మనకంటే బలవంతులైన రాజులు ఏ రోజునైనా మనమీద దండయాత్ర సాగించి, ఏ క్షణంలోనైనా ఈ రాజ్యాన్ని కైవసం చేసుకొనవచ్చు!

కాని కట్టుకున్న భార్య పది కాలాలపాటు కలిసి ఉండేది గనుక-కలివిడిగా కాపురం చేసిందా లేదా అనేది ముఖ్యం! కన్న బిడ్డలు వంశోద్ధారకులు గనుక వాళ్లు ప్రయోజకు లయ్యారా-లేదా అనేది అతి ముఖ్యం!

కట్టుకున్న భార్య విషయంలో విజయేంద్ర వర్మ మహారాజుకు నూటికి నూరు మార్కులు సంప్రాప్తమైనా, కన్న బిడ్డల విషయంలోనే చిన్న అపశృతి జరిగి- ఆవేదన కలుగుతూ వుంటే, అవమానం రగులుతూ ఉంది!

మహామంత్రి:- "జరగ వలసిందేదో జరిగి పోయింది! గతాన్ని తలుచుకొని ఎంతగా చింతించినా ఇప్పుడు ప్రయోజనం ముండదు కదా? ముందు జరగవలసిన కార్యక్రమానికి పునాదులు వెయ్యాలిగాని.. వేరే ఎన్ని విధాలుగా విచారిస్తూ కూర్చున్నా ఏమిటి ప్రయోజనం చెప్పండి? ఆలోచించండి మహారాజా!"

ఇలా ధైర్య వచనాలు వల్లిస్తూ, కర్తవ్య నిర్వహణకై కార్యోనుఖులు కమ్మని మహామంత్రి బోధ చేస్తూ ఉండగనే, మార్తాండ వర్మ, విక్రమ వర్మను బంధించి తీసుకొని వచ్చి, మహారాజు ఎదుట నిలిపి తన ముసుగును తొలగిస్తాడు!

మార్తాండవర్మ:- "తండ్రిగారి పాదాలమీద పడి క్షమాపణ కోరుకో!"

అని అంటూండగనే విక్రమ వర్మ అన్నగారి నిజస్వరూపం తెలుసుకొని ఆశ్చర్యానికి లోనవుతాడు! అంతలోనే జరిగిన అవమానం గుర్తొచ్చి ఆక్రోశంతో ఉడికి పోతూండగా...

మహారాజు:- "నాయనా! మార్తాండ వర్మా! వాడు పసివాడు, లోకానుభవం లేనివాడు, బాధ్యతలంటే ఏమిటో తెలియనివాడు. ఏదో ఒక విధంగా నచ్చచెప్పి మార్గదర్శకుణ్ణి చెయ్యాలి గాని, ఈ విధంగా బంధించి తీసుకు వచ్చావు!... వీడు నీ తమ్ముడు రా! ఈ నీ చర్యతో లోకమెంత చిన్న చూపు చూస్తుందో ఏ మాత్రంమైనా ఆలోచించావా? ఎంతపని చేశావు నాయనా!"

అంటూ మహారాజు బాధగా తన ఆసనము నుండి పైకి లేచి విక్రమ వర్మ దగ్గరకు వచ్చి చేతికున్న కట్లు ఊడదీసి, తనవద్దకు తీసుకొని వెళ్లి కూర్చో బెట్టుకోవాలనే మహారాజు ప్రయత్నాన్ని, నిర్లక్ష్యంగా ప్రతిఘటిస్తాడు విక్రమవర్మ చేసేది లేక మహారాజు వెళ్లి తన ఆసనముపై ఆసీనుడవుతాడు.

విక్రమ వర్మ:- "గౌరవ మర్యాదలు!..పరువు ప్రతిష్టలు...దయా ధర్మాలు...పుత్ర వాత్సల్యాలు! ఈ ఉత్తమ పదాలు మీ నోటివెంట రావలసిన వేనా! భగవంతుడి దృష్టిలో తండ్రికి బిడ్డలందరూ సమానమన్నాడే! మరి మీ దృష్టిలో నేనంత చిన్న వాడి నయ్యానా? ఈ రాజ్యంలో ఎట్టి అధికారమూ లేని అసమర్ధుడనా? అదియును గాక ఒక స్వతంత్ర వ్యక్తిగా కూడా జీవించే అర్హత లేని హంతకుణ్ణనా, నన్ను ఈ విధంగా బంధించి తీసుకు వచ్చింది? కులముగాని కులము వాడైనా, కోయ గూడేనికి నన్ను నాయకుణ్ణి చేశాడు! ఆ మాత్రం గౌరవం కన్న తండ్రి, తోడ బుట్టి న సోదరుడూ చూపలేక పోయారు!"

కడుపులో ఉన్న కసిని...మనసులో రగిలే శెగనూ దాచుకో లేక, భరిస్తూ ఊరుకోలేక- మాటల తూటాలతో రెచ్చ గొట్టే ధోరణి ప్రదర్శిస్తూ, తనలోగల అక్కసునంతా వెళ్లగ్రక్కాడు విక్రమ వర్మ!

బయట వాళ్లపాటి మీరు చెయ్యలేక పోయారని నింద మోపడం, నిష్టురం ఆడే

ఆ పోలికలోనే-అతగాడి అల్పత్వం స్వల్పత్వపు-బాల్య స్వభావం తేట తెల్ల మవుతోంది! ఒక గూడేనికి ఉండే నాయకత్వాన్ని-ఒక రాజ్యానికి వహించే ఆధిపత్యాన్ని ఒక్కటిగా పోల్చి మాట్లాడుట లోనే అతగాడి అనుభవ రాహిత్యం అవగత మవడమే గాక-ఆలోచనా విధానం కూడా అంతంత మాత్రమే నని-ప్రస్ఫుటంగా బహిర్గత మవుతూ, చెప్పకనే చెప్పినట్లయింది!

మార్తాండ వర్మ:- "దయ తలచి..దాక్షిణ్యం చూపి నిన్ను ఆ కోయమూక తమ గూడేనికి నాకయుణ్ణిగా చేశారని ఉబ్బి తబ్బిబ్బవుతున్నావు! అసలు ఆ భేతాళు డి కుతంత్రాన్ని గనుక నువ్వు తెలుసుకుంటే, ఈ విధంగా మాట్లాడవు...ఇలా ప్రవర్తించనూ ప్రవర్తించియుండవు!"

ఇక ఉపేక్షిస్తూ మాట్లాడటం ఎంతమాత్రం కూడా సముచితం కాదనుకొని, నీ అనుచిత ప్రవర్తనకు సాకేత సారధి ఆ భేతాళుడే నని.. వాడి కుతంత్రం అత్యంత దుర్వర్తన గలదిగా, దురాలోచనతో కూడినదిగా విశదపరిస్తేనన్నా తమ్ముడు తన దారిలో కొస్తాడేమోనని-విషయాన్ని వివరిస్తూ, అతనిలో గల అపోహలను మసక బార్చే ప్రయత్నం చేశాడు మార్తాండ వర్మ!

విక్రమవర్మ:- "మార్తాండ వర్మా! అన్నవని ఇంతకాలము కొంత వరకు ఉపేక్షించి యూరకున్నాను! భేతాళుణ్ణి ఒక క్రూరుడిగా పోల్చగల సమర్థుడవా నీవు?"

తిక్కముదిరింది రోకలి తలకు చుట్టమన్నట్టు! అన్న మార్తాండ వర్మ కంటే-ఆ కోయదొర భేతాళుడే అన్ని విధాల అధికుడిగాను, యోగ్యుడిగాను, ఇతగాడికి సాయమందించే సంస్కార వాదిగాను, సంఘ సంస్కర్తగాను అనిపించ సాగాడు పాపం విక్రమ వర్మకు!

మహారాజు:- "ఎవరు సమర్థులో-ఎవరు అసమర్థులో దాగి వున్న సత్యాన్ని కళ్లువిప్పి చూస్తే నీకే తెలుస్తుంది!"

తండ్రికూడా అన్నను పూర్తిగా సమర్థిస్తూ మాట్లాడుతూ ఉండడంతో-ఇది అందరూ కూడబలుక్కొని ఆడుతున్న అంతర్నాటకంగాను, కుయుక్తుల కుట్రగాను భావించిన విక్రమ వర్మ...

విక్రమవర్మ:- "మాచేతిలో బంధింపబడి వున్నాడు-మనల్నేమీ చేయ్యలేడని నోటికి వచ్చిన విధంగా మాట్లాడకండి! మీరు పెద్దవారు, బుద్ధిమంతులు, విజయ నగర సామ్రాజ్యన్ని పరిపాలించే 'ధర్మ' భూపాల మహారాజు గదా! అటువంటి మీరు ఇలా దొంగచాటుగా, అల్లునివలే ఎవరూ లేని సమయాన ఒంటరిగా చూసి, బంధించి తీసుకు రావడం-కాబోయే మహారాజులవారి బల పరాక్రమాలకు ప్రత్యక్ష సాక్ష్యమా? లేక మీ నీతి నిజాయితీలకు ప్రబల నిదర్శనమా? మీరు చేసిన ఈ కుతంత్రానికి భేతాళుడు ఎంతగా బాధ పడుతుంటాడో...ఇది ఎవరి మోసమో తెలియక-ఎంతగా తల్లిఢిల్లుతూ ఉంటాడో...నాకు తెలుసు!"

పేగు బంధం కంటె కూడా విక్రమ వర్మకు స్నేహ బంధం లెక్కకు ఎక్కువదిగాను, మిక్కిలి మక్కువతో కూడినదిగాను అనిపించిన కారణంగా, అల్పుడికి ఆధిఖ్యతను కల్పిస్తూ, ఆరాధ్యుడిగా కీర్తించే స్థాయికి దిగజారడం- మందు సమకూర్చిన మాయ కావచ్చునూ, మగువను తార్చిన ఏమార్పు కావచ్చును!

మార్తాండవర్మ:- "అవును! అసలు కుతంత్రాన్ని కడుపులో పెట్టుకొని, కల్లబొల్లి మాటలతో నిన్ను ఆ గూడేనికి నాయకుడుగా నియమించి-తండ్రి మీదకు అన్న మీదకు దండోరా సాగించి, రాజ్యాన్ని అపహరించాలన్న ఆశకు అంతరాయం కలిగిందని బాధ పడుతూనే ఉంటాడు!"

అయిన వాళ్లు-అనుకున్నవాళ్లే అనేక విధాల ద్రోహం తలపెట్టే ఈ రోజుల్లో, ఎవడో ముక్కూ మొహం తెలియని కోయవాడు-వీడికి సాయ పడటానికి, మేలు చేయడానికి వచ్చాడని నమ్మడం...ఎంతటి అవివేకం, మరెంతటి అల్పత్వం, వేరెంతటి అమాయకత్వం!

విక్రమవర్మ:- "మార్తాండ వర్మా!"

భేతాళుడి నిజాయితీని శంకించడం...అతగాడిపై ద్రోహబుద్ధి గలవాడిగా కళంకాన్ని ఆపాదించడం విక్రమ వర్మకు భరించరాని బాధ కలిగించడమే గాక...సహించలేని కోపం కూడా తెప్పించింది!

మహారాజు:– "ఏం! నిజాన్ని బయలు పరచాడనా నీ బాధ? కన్న తండ్రి, తోడ బుట్టిన సోదరుడు నిన్ను అన్యాయం చేసే వాళ్లూను!...ఎవడో కులముగాని కులము వాడు, అమాయకుల నోళ్లుగొట్టి తమ డొక్కలు నింపుకు బ్రతికే కోయవాడు నీ మేలు కోరేవాడూనా?"

ఇంతటి అవగాహన రాహిత్యంతో, అపరి పక్వపు ఆలోచనతో అన్నమీదే కత్తి కట్టిన బిడ్డను చూస్తే, ఏ తండ్రి హృదయం రగిలి పోకుండా వుంటుంది? ఎంత వరకని వోర్పుతో చూస్తూండి పోగలుగుతుంది?

విక్రమవర్మ:– "సరే! సత్యాన్ని గ్రహించాలని, నాకు మిత్రులెవరో, శత్రువు లెవరో తెలుసుకోవాలనే కుతూహలం మీకుంటే నా వెంబటే రండి. నన్ను మీరు బంధించి తీసుకు వచ్చినందుకు తనేవిధంగా బాధ పడుతున్నాడో కళ్లార చూసి, చెవులార విందురుగాని!"

ఎంతటి ఔదార్యం, ఆదర భావం ఇతగాడిపై వాళ్లు చూపించి ఉండక పోయుంటే... ఇంత నమ్మకంగా భేతాళుణ్ణి వెనకేసు కొచ్చేవాడు కాదు విక్రమ వర్మ! అదే ఆశ్చర్యం! అసలుకంటే నకిలీకి తళుకు ఎక్కువని పెద్దవాళ్లు ఊరికే చెప్పలేదు!

మార్తాండవర్మ:– "సరే! తను చూపుతున్న వాత్యల్యమంతా నాటకమన్న సత్యాన్ని నీవు గ్రహిస్తే, యధా ప్రకారంగా వచ్చి ఇక్కడ ఉంటావ?"

నిస్వార్ధపరుడి నమ్మకం ఎంత నిఖార్సుగా ఉంటుందో, మార్తాండ వర్మ మాటల్లోనే అర్ధమవుతుంది! ఎందుకంటే...అవతలి వాడిది కుట్రతో కూడిన కుతంత్రమే గనుక–ఈ బంగారు బాతును ఎవరో అపహరించుకుని తీసుకొని వెళ్లారని తెలియడంతోనే, పట్టరాని కోపంతో తన నిజ స్వరూపం ఏదో విధంగా బయట పడుతుందనేది జగమెరిగిన సత్యం. మన మెరిగిన నిజతత్వం కూడా!

విక్రమవర్మ:– "ఉండటం కాదు! మీరు విధించిన దండనకు బాధ్యుడనౌతాను! సంతోషంగా అనుభవిస్తాను! కాని మరొక విషయాన్ని మీరు గ్రహించాలి. నేను చెప్పిన వన్నీ నిజాలుగా కన్పించి, వాళ్లు చూపించే వాత్సల్యమంతా యదార్ధమయిందిగా రుజువయితే, ఆ తరువాత మీరు తండ్రని గాని, నీవు అన్న వనిగాని చూడను. సరే వెళదాం పదండి!"

అని కొడుకు లిద్దరూ నిష్క్రమించగా, మహామంత్రి కూడా మహారాజు వద్ద శెలవు తీసుకొని వెళ్లిపోవును. అంతట మహారాజు నిర్వేదం నిండిన వదనంతో నిరోమయంగా అలాగే తన ఆసనంలో కూర్చుండి-ఉండి పోతాడు! ఆ తరువాత తానుకూడా వాళ్ల వెనకాలే వెళతాడు.

(7వ రంగం సమాప్తం)

## (8వ రంగం)

కొండ గుహలో భేతాళుడు అంతులేని ఆగ్రహంతో రగిలిపోతుంటాడు! ఉడుకెక్కిన ఉద్రేకంతో ఊగిపోతుంటాడు! పండిన పండు చేతిదాకవచ్చి చిక్కకుండాను, నోటి దాకా వచ్చి దక్కకుండాను జారిపోవడంతో, ఎంతటి నిగ్రహ పరుడైనా ఉగ్ర నరశింహుడు కావడం-సర్వ సాధారణ విషయమే, అసామాన్యులకు సైతం!

భేతాళుడు:- "ఇంతమందిని గొర్రెల్ని మేపినట్టు ఇంతకాలం మేపుతూ వచ్చాను. అంతా ఎక్కడికి చచ్చారు? అవసరానికి ఒక్కడు కూడా ఉపయోగ పళ్లేదు! శతృవు తెలివిగా ఎవరూ లేని సమయం చూసి, కాపుకాసి తనపని తాను నిరాటంకంగా, నిరాఘాటంగా జరిపించుకొని మరీ వెళ్లిపోయాడు! ఇంతమందివి ఉండికూడా ప్రతిఘటించి కాపాడుకో లేకపోయాం! ఇప్పుడు పరితపించి ప్రయోజన మేముంది. పరిహాస పాత్రం గాక!"

తాను ఎంతోకాలంగా మాటువేసి, కాపుకాసి, విక్రమ వర్మ బలహీనతలు కనిపెడుతూ, పసిగడుతూ వచ్చాడు. అతగాడి మొదటి బలహీనత మగువ పొందని గ్రహించాడు. అందుకు కావలసిన అన్ని హంగులుగల సుందరాంగిని పొందు కమర్చాడు. మగువ వలపుతోడు, మధువు కైపుకూడా తోడైతే గూడు కదలడని, తోడు వదలడని, ఎంతగానో శ్రమించాడు, భ్రమించాడు! సంకల్పం సరైంది కానప్పుడు, స్వార్థం పరాకాష్ట చేరినప్పుడు-ఫలితం ఫలించదు, 'భగవంతుడు' సహకరించదు!

వెంకడు:- "ఇదంతా ఏంతో మాయగా వుందయ్యా! వాళ్లొచ్చే సరికి ఇక్కడ మనవాళ్లెవరం లేకుండా, అందరం కట్టకట్టుకుని ఒకేసారి దూరంగా ఎల్లిపోటం ఇసిత్రంగాను, ఇద్దూరంగాను కూడా వుందయ్యా!

ఇప్పుడు మనం ఏంశేయ గలుగుతాం...ఆ అయ్యను ఎట్టాగ మళ్లీ తెచ్చుకో గలుగుతాం! అంతా అయిపోయింది!"

కూలివాడైనా, కూటికి లేనివాడైనా వెంకడు విశ్వాసం గలవాడైన కారణంగా, జరిగిపోయిన ఈ ఘోరానికి, ఎంతగానో బాధ పడ్డాడు! ఈ చర్య ఎవరో విద్రోహులో, లేక ఆ బాబుకు విరోధులో అయి వుంటారనుకున్నాడుగాని...వాళ్ల కుటుంబ పరంగానే ఇలాంటి చర్య జరిగిందని వాడు అనుమానించలేదు! అలాంటి ఆలోచన కూడా వాడికి రాలేదు.

భేతాళుడు:- "ఊరుకుంటే కాదురా! ఎలుకను తెచ్చేంత వరకు పిల్లిని జాగ్రత్తగా చూడాలిరా...జాగ్రత్తగా చూడాలి! కదిలించి వదిలేస్తి వంటే కుదిలించి మరీ కుదిపేస్తది రా! అదిలించి మరీ అణిచేస్తది-ఏమనుకున్నావో!

ఇంతా జరిగాక ఇక వదిలేసి ఊరుకుందా మనుకున్నా, అది నీడలా మనల్ని వెంటాడి-మూలాలను పెకలించడమేగాక, దూరాలను నిర్దేశిస్తుంది, తీరాలవెంట తరిమి పారేస్తుంది! ఆరుగాలం ఆత్రంగా ఎదురు చూసిన ఆశాసౌధం-కళ్లకి కనిపిస్తూ కనుమరుగౌతుంటే గుడ్లప్పగించి చూస్తూ ఎవరైనా ఎలా ఉండిపోగలుగుతారు, ఎలా తిండి తిన గలుగుతారు?

వెంకడు:- "ఏందిదొరా! ఎలికేంటి...పిల్లేంటి? అంతా ఏదో కొత్తగా మాట్టాడు తున్నారు దొరా!"

ఆ ద్వందార్ధ భావజాలం పాపం వెంకడి కెలా అర్ధమవుతుంది! అసలేవాడు అమాయకత్వం మూర్తీభవించి, ఆరాధనా భావం పెంపొందించుకొన్న వాడాయె! తిన్న ఇంటికి, ఉన్న యింటికి మేలు చెయ్యాలను కొనేవాడేగాని, కీడు తలపెట్టాలనే తలంపే వాడికి తట్టదు కదా!

భేతాళుడు:- "అహహ...నీకేం తెలుసురా అందులోవున్న కిటుకు, తననీ గూడేనికి నాయకుణ్ణిగా ఎందుకు చేశాననుకున్నావు? ఆ మాత్రపు దొర మనకు దొరక్కపోతాడని కాదు. విజయ నగర మహారాజుకు ఇద్దరు కుమారులున్నారని తెలియగానే కొంత ఆశ కలిగింది. ఎలాగో విక్రమ వర్మను మచ్చిక చేసుకున్నాను. అతగాడి

బలహీనతలపై బాణం వొదిలాను. రాజ్యకాంక్ష రేపాను. తండ్రి మీదకు అన్న మీదకు ఉసిగొల్పాను. అది సక్రమంగా సాగుతుందనుకున్నాను. కాని... వీడెవడో ముసుగు వేషదారి ప్రవేశించి నా ఆశలకు అడ్డు తగలడానికి పూనుకున్నాడు!"

ఇదంతా అప్పటిదాకా చాటుగావుండి వింటూవున్న విజయుసేన మహారాజు, మార్తాండ వర్మ విక్రమ వర్మలు భేతాళుడిలోగల కుయుక్తులు, కుట్రతో కూడిన కుతంత్రమంతయూ అతగాడి నోటినుండే వెల్లడి కావడంతో విక్రమ వర్మలో అదుపు చేసుకోలేనంత ఆగ్రహం అవధులు దాటింది! ఒక్కసారిగా భేతాళుడిపై కురికి. కరవాలాన్ని అతగాడి గుండెపై గురిపెట్టి...

విక్రమ వర్మ:- "ప్రవేశించడం కాదురా! నీ అంతు చూడటానికి, నిన్ను హతమార్చడానికి వచ్చాడు."

అంటూ అవధులు దాటిన ఆగ్రహంతో భేతాళుడిపై కురికాడు విక్రమ వర్మ! ఈ హఠాత్ సంఘటనతో భేతాళుడు అవాక్కయ్యాడు. వెంకడు చిన్నగా అక్కడినుంచి జారుకున్నాడు. కల్మష పూరిత స్వభావంగల ఎవరైనా ఏదో ఒక విషయంలో, ఎప్పుడో ఒక సమయంలో, వాళ్ల నిజ స్వరూపం బయట పెట్టకనూపోరు, వాళ్లు తీసుకున్న గోతిలో వాళ్లే పడకునూ పోరు!

భేతాళుడు:- "దొరా! మీరు క్షేమంగా వచ్చారా? మీ గురించే బాధ పడుతున్నా దొరా! మీరు క్షేమంగా రావాలని మా కొండ దేవరికి మొక్కుకున్నాదొరా!

అంటూ లేనిపోని ప్రేమను కనబరుస్తూ, తనలోగల తత్తరపాటుని అదిమి వుంచుతూ, గుండెకానిన కరవాలాన్ని పట్టిక్రిందికి దించుతూ, కృత్రిమ తత్వపు చూపులతో-వికృత చేష్టల విన్యాసాలు సాగిస్తూ, విశేషంగా వినయ ప్రదర్శన గావించ సాగాడు భేతాళుడు.

విక్రమవర్మ:- "ఎవడురా నీ దొరా? లేని పోనివన్నీ కల్పించి చెప్పి, మా అన్నదమ్ముల మధ్య చిచ్చు రగిల్చి, దివ్యజ్యోతిలా వెలుగొందుచున్న మా విజయ నగర సామ్రాజ్యాన్ని చూసి కళ్లు వోర్వలేక-రాజ్యాన్ని అపహరించాలనే దుర్బద్ధితో- శకునిలా దాపురించి, నాపై విషపు

వాయువులు ప్రయోగించావు! అది యీనాడు నీ కంఠానికే చేటు తెచ్చింది."

అంటూ కరవాలాన్ని పైకెత్తి భేతాళుడి కంఠానికి గురిపెడతాడు విక్రమవర్మ. ఇదంతా అప్పటిదాకా చాటుగా వుండి తిలకిస్తూన్న మహారాజు మార్తండ వర్మ ఒక్కసారిగా ముందుకొచ్చి విక్రమ వర్మ చేతిలోవున్న ఖడ్గాన్ని పట్టి క్రిందికి దించుతూ...

మార్తాండవర్మ:- తమ్ముడూ! ఆగు! ఇంతవరకూ మన పెద్దలు చిన్న విషయాలకు రక్తపాతాలు జరుగ నివ్వలేదు. "ఆ సాంప్రదాయాన్నే మనమూ ఆచరించాలి, పాటించాలి కూడ! ఇటువంటి దురాశ పరులకు ఇలాకాదు–చిత్రవధే తగిన ప్రాయశ్చితం! ఇతన్ని, ఇతని పరివారాన్ని బంధించి తీసుకుపదండి!"

వీరికి చేరువలోనే కాపు కాసివున్న సైన్యం బిలబిలా కోటలోపల ప్రవేశించి, కొందరు భేతాళుణ్ణి బంధిస్తే, మరి కొందరు లోపలికెళ్లి మిగతా వాళ్లకై గాలింపు గావిస్తారు. పశ్చాత్తాపంతో కుమిలిపోతూ వున్న విక్రమ వర్మ...

విక్రమవర్మ:- "అన్నయ్యా! నన్ను క్షమిస్తావ?"

అంటూ మార్తాండ వర్మను ఆలింగనం చేసుకొని రోదించును. అన్న మార్తాండ వర్మ బుజ్జగింపుతో కొంత ఊరట చెందినవాడై, ప్రక్కనే గల తండ్రిగారి పాదాలపైబడి కుమిలి కుమిలి ఏడుస్తూ...

విక్రమవర్మ:- "నాన్నగారూ! నన్ను క్షమించండి! మిమ్మల్ని చాలా బాధపెట్టేను. ఈ వయసులో మిమ్మల్ని సుఖపెట్టవలసింది పోయి అనేక విధాలుగా కష్టపెట్టేను, కాఠిన్యం ప్రదర్శించాను, కుటిల స్వభావంతో వ్యవహరించాను. నాపాపానికి నిష్కృతి లేదు! నాన్నగారూ నిష్కృతి లేదు!"

అంటూ తండ్రిగారి పాదాలపైబడి చిన్న పిల్లవాడిలా రోదిస్తూవున్న విక్రమవర్మను రెండు రెక్కలుపట్టి పైకిలేపి ఆర్ద్రత నిండిన హృదయంతో అక్కున చేర్చుకొని, హృదయానికి హత్తుకుంటాడు విజయసేన మహారాజు, తనుకూడా ఊరడించే ప్రయత్నంగా...!

మహారాజు:- "నాయనా విక్రమ వర్మా! జరిగిందేదో జరిగి పోయింది. ఇంతకాలం

కొంత మానసిక వేదన అనుభవించమని ఆ భగవంతుడు నా నొసటన వ్రాసివుంచాడు. అందుకే ఇలా జరిగిపోయింది! ఇప్పటికైనా వాళ్ల కుతంత్రాన్ని తెలుసుకోగలిగావు, నా బిడ్డ విక్రమ వర్మగా మార్పు చెందావు! చాలా సంతోషంగా వుంది నాయనా... చాలా సంతోషంగా వుంది!"

అంటూ కళ్లల్లో ఉబికే ఆనంద భాష్పాలను కాంతి పుంజాలుగా భ్రాంతి చెందుతూ, తన్మయత్వంలో తనని తాను మరచిపోయాడు విజయసేన మహారాజు. తప్పు తెలుసుకున్న బిడ్డ పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, తండ్రి దగ్గర తన తప్పుని ఒప్పుకొని క్షమించమని కోరుతూ వుంటే, అంతకంటే ఏ తండ్రికి మాత్రం కావలసిందేముంటుంది? ఆ పాటి శిక్ష అనుభవించాక–మరే బిడ్డయి నా మరలా, మరలా తప్పు చేయడం ఎందుకు జరుగుతుంది? కానీ...మరింకేదో బెరుకు మనసును తొలుస్తూవుంటే!

విక్రమవర్మ: – "ఇంకా రాజ్యంలోనికి వచ్చి ప్రజలముందు ఏ విధంగా తలెత్తుకొని తిరిగేది? తండ్రినీ, అన్ననూ అనేక కష్టాలుపెట్టి, ప్రజలలో సంతోషాన్ని క్షీణింపజేసి–ఉన్న కొంపలు కాస్త కూల్చడానికి వచ్చావా? అని వాళ్లడిగితే వారికి ఏమని జవాబిచ్చేది? చెడ్డవాడురా వీడని పేరుగాంచిన తరువాత–వాడు మంచివాడుగా మారినా, లోక మెందుకు నమ్ముతుంది? విషపు పురుగులా చూస్తుంది. కాకిని పొడిచినట్టు పొడుస్తుంది. అటువంటి అవమాన కరమైన బ్రతుకు బ్రతికే కన్నా ఈ కరవాలంతో..."

అంటూ విక్రమ వర్మ కరవాలము పైకిలేపి– శిరస్సు ఖండించుకొన బోవును, అంతలో మార్తాండ వర్మ ఒక్క ఉదుటనే ముందుకొచ్చి, విక్రమ వర్మ చేతిలోవున్న ఖడ్గాన్ని లాగేసుకొని...

మార్తాండవర్మ: – "తమ్ముడూ! ఏవిటి ఈ అఘాయిత్యం? దీనికో సమేనా మేము పడిన యీ శ్రమంతా?"

అని అన్న అంటూండగనే విక్రమ వర్మ ఒక్కసారిగా మార్తాండ వర్మను పెనవేసుకొని ఎక్కి ఎక్కి ఏడుస్తూవుంటే, ఆదృశ్యం చూసిన తండ్రి హృదయం ఆనంద పారవశ్యంలో తేలియాడింది. అన్న దమ్ముల ఈ కలయిక కోసమే తాను ఇన్నాళ్లుగా ఎదురు చూసింది.

యీ అనుబంధం శాశ్వతంగా పది కాలాలపాటు కొనసాగాలనే తానింతగా తాపత్రయ పడింది, పరితపించిందీను! కుమారుల దగ్గరకొచ్చి...

మహారాజు:- "నాయనా విక్రమవర్మా! మీ తండ్రి మీ మీద పెట్టుకున్న ఆశలకు ఇదా నువుచూపే ప్రతిఫలం!"

అంటూ కళ్ల నీళ్లు పెట్టుకొంటూవున్న తండ్రి పాదాలచెంత మోకరిల్లి, తన మూగవేదనతో తన రోదనను తెలియజేసుకున్నాడు విక్రమవర్మ! ఇక ఏ దుష్ట శక్తులూ వీళ్ల అనుబందాన్ని చెరచలేవు. ఏ దుర్మార్గులూ వీళ్ల రాజ్యంవైపు కన్నెత్తి కూడా చూడలేరు. రామలక్ష్మణుల ధీరశక్తిలా ఈ అన్నదమ్ముల మైత్రికూడా, అజరామరంగా కొనసాగాలని కోరుకుందాం!

సర్వే జనా సుఖినో భవంతు

స్వస్థి

---------

- 'స్త్రీ' తనం ఎంతటి విచిత్రం! రూప లావణ్యములు పొందికగా గల 'స్త్రీ' ఎంతటి పేదరికంలో ఉన్నదైనా, ఆమె 'స్త్రీ' ధనాన్ని దోచుకోవడానికి ఎందరు-ఎంతగానో పరితపిస్తారు ! వాళ్ళెంతటి పెద్దవాళ్ళయినా మతులుచెడి మరీ మసలుకుంటారు, గతులు దప్పి మరీ ప్రవర్తిస్తుంటారు !

- కట్టలు తెగిన ఆవేశం కళ్ళు మూసుకొని పోయేలా చేస్తుంది. పదవిపైన వ్యామోహం పేగు బంధాన్ని సైతం ప్రశ్నించేలా చేస్తుంది ! ఆత్మద్రోహం నీచ సంస్కారాలను పాదు గొలిపేలా చేస్తుంది ! చెడుస్నేహం దుష్ట స్వభా వాలను పెంపు గావిస్తుంది !

- వివేకాన్ని బోధించడం అనేది విజ్ఞతగా అనిపించు కొంటుందిగాని... వినేవ్యక్తిలో చైతన్యం కలగనప్పుడు అది చాదస్తంగా మారిపోతుంది... చపల చిత్తంగాను రూపుదాలుస్తుంది!

- ఒక విషయాన్ని వివరించే క్రమం వివరాణాత్మకమై ఉండాలి. విషయ పరిజ్ఞానంతో కూడినదై కూడా వుండాలి అప్పుడే దాని జటిలత్వం ఎదుటివాడికి గోచరమయ్యేది... ప్రత్యర్ధి కుటిలత్వాన్ని కూకటి వ్రేళ్ళతో కూల్చనూ వీలయ్యేది.

- పెద్దరికం పిన్నలకు బుద్ధులు నేర్పాలని చూస్తుంది... శుద్ధులు బోధించాలనీ తాపత్రయ పడుతుంది. అంతేగాని... తొందరపాటు చర్యలతో గందరగోళం సృష్టించి, హింసను ప్రోత్సహించాలని కోరుకోదు... వినాశనం కల్పించాలని ఆత్రపడదు... మంద బుద్ధిని ఆసరాచేసుకొని, అందినంతా కాజెయ్యాలనీ ఆశపడదు... ఆరాటం చెందదు. అదే పెద్దరికం యొక్క ఉపయుక్తత... పరిపక్వత.... ప్రశంసార్హత కూడా!

- 'ఎంతటి అధికారానికి మనం అధిపతులం అనేది ముఖ్యంకాదు...' అంతటి అధికారంలో, మనం ఎంతకాలం కొనసాగామనేది కూడా అంతకంటే ముఖ్యం కాదు. కాని... కట్టుకున్న భార్య పదికాలాలపాటు కలిసి వుండేది గనుక... కలివిడిగా కాపురం చేసిందా.. లేదా అనేది ముఖ్యం. కన్నబిడ్డలు వంశోద్ధారకులు గనుక... వాళ్ళు ప్రయోజకులయ్యారా... లేదా అనేది అతిముఖ్యం.



అల్లిక 'శ్రీ' కర్త

ఆశయ 'కృతి' కర్త

**పట్టెల రామకోటేశ్వరరావు**

'తల్లి తండ్రి'

పట్టెల వీరాస్వామి - వెంకాయమ్మ

చావలి గ్రామం - వేమూరు మండలం

గుంటూరు జిల్లా

69



| | మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVB01A193 |
| పుస్తకం పేరు | 00ఔ[illegible] 5003 |
| తారీఖు | 31/05/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 79 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI,67,68 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | Praveen |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |